# తెనాలిరామకృష్ణచరిత్రము



(ఐదంకముల నాటకము)

గ్రంథకర్త:

చింతా సోమసుందరజోస్యులుగారు,
ఈడేపల్లి,
బందరు.




ప్రకటనకర్త:
కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్ డిపో.,
బెజవాడ. (కృష్ణాజిల్లా)

 [వెల 0-8-0

# గంగావతరణము.

(గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు)

గంగా గౌరీ సంవాదము, గంగ శివజటాజూటము నధిష్ఠించి నీకు సవతినౌదునని పార్వతితో పంతమాడుట, నారదుని చిత్రలీల, గంగ విష్ణు పాదోద్భవియగుట, భగీరథుడు, గంగ నిలాతలమునకు దెచ్చుటకై తపముచేయుట, క్షీరసాగర మథనము, శివుడు గరళపాన ముచేసి వెఱ్ఱివాడగుట, నారదుని మాయపెండ్లి (హాస్యము) జగన్మోహినీ లీలలు, విషతాపమున శివుని వేదన, గంగా గౌరీ కలహము, నారదుని కలహాశ నానందము, విఘ్నేశ్వర ప్రాదుర్భావము, విఘ్నేశ్వరునకు గజముఖము గల్గుట, గంగోత్తరణము మున్నగు శివపురాణ గాథలు, చిత్రనాటకరీతి శృంగార హాస్యరస మిళితములై రచింపబడినది. కవిత్వము ద్రాక్షాపాకము. హాయిగల్గించు కీర్తనలు. రంగస్థలముల కీర్తిగన్న నాటకము. చదివితీరవలెను. వెల రు. 1—0—0

# సంగీత సావిత్రి

(గ్రంథకర్త:—చెలుకుపల్లి వేంకట్రామయ్యగారు)

ఆంధ్రరంగస్థలము లందంతటను అద్భుతముగా ప్రదర్శింపబడు ఈ ఈనాటకపుకీర్తిని వేరుగా వివరింప బనిలేదు. సావిత్రీ సత్యవంతుల నిర్మలానురాగము—సావిత్రి దృఢచిత్తము—యముని భయంకరలీల. సావిత్రీ, యముల వాదప్రతివాదములు చదివితీరవలెను. అన్నిటికన్న ప్రత్యేకముగ ఇందలి ముద్దులొలుకుపద్యములు తేనెల తేటలగుపాటలు అక్షరలక్షలు చేయునవి. వెల రు. 0—8—

దొరకువారు:—కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్కుడిపో, బెజవా

ప్రచురణకర్త:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ.

మొదటి కూర్పు 1000.

1934

[వెల 0-8-0

# తెనాలిరామకృష్ణచరిత్రము

(ఐదంకముల నాటకము)

గ్రంథకర్త:

చింతా సోమసుందరజ్యోతిశ్శాస్త్రులుగారు

ఈడేపల్లి, బందరు.

# ఇందలి పాత్రలు.

## పురుషులు.

1. రామలింగఁడు
2. కృష్ణదేవరాయఁడు
3. తాతాచార్యుఁడు
4. ధూర్జటి
5. తిమ్మరుసుమంత్రి
6. నరసకవి
7. యోగి
8. సేవకుఁడు
9. శిష్యుఁడు
10. శివరామశాస్త్రి
11. వెంకటశాస్త్రి
12. సూతుఁడు

## స్త్రీలు.

1. కాళికాదేవి
2. మానవతి
3. శ్యామల
4. సరస్వతి

---

ఓం

శ్రీరస్తు.

శుభమస్తు—అవిఘ్నమస్తు.

శ్రీరామచంద్ర సహాయోస్తు.

# తెనాలి రామకృష్ణ చరిత్రము.

## నాంది

వరకాళీ కరుణాకటాక్ష నిచయ ♦ ప్రాలబ్ధనాహిత్య సు
స్థిరుఁడై యొందును నాంధ్రభోజుఁ ♦ డనకీర్తిఁగన్న శ్రీకృష్ణరా
ద్ధరణీనాథ సభాప్రవిష్ట కవిరా ♦ ట్సంస్తుత్య చాతుర్యభా
స్వరుఁడై మించిన రామకృష్ణకవి స ♦ ద్భావోక్త్యాళి మిమ్మోమ్ముఁగాక॥



శ్రీ

# తెనాలి రామకృష్ణ చరిత్రము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

రంగము:—రామలింగని యిల్లు.

[ఒంటరిపాటున రామలింగఁడు ప్రవేశించును.]

రామ—ఈ రాత్రి నా మిత్రుఁడైన గుణనిధియింటికిఁ బోవుదును. ఎచటికిఁ బోదమన్న నిట్టి విషమపరిస్థితుల నన్నాదరించు హితులన్యులు కానరారు. హితులు హితులని వాపోవుచుందుము. కాని యిక్కాలపువా రేటిహితులు? చేతఁ బైకమున్నంతవఱకద్దాని వినియోగమునకైఁ బెనఁగులాఁడువారేగాని మానధనములనుకాపాడఁగల్గువారుందురా? (స్మృతి నభినయించి) అహో! ఇతరులను దూషింపనేల! నా స్థితిని నేనేల గ్రహించనైతిని. అతిబాల్యముననే మా తండ్రియగు రామశాస్త్రిలవారు స్వర్గస్థులుకాఁగా ననదయగు మా తల్లి లక్ష్మమ్మ నాతో నీ తెనాలి గ్రామమునఁ గల సోదరునియింటికిఁ జేరినది.

తనయులయెడ తల్లిదండ్రుల కుండు ప్రేమము— అందునను తల్లికిఁగల యనురాగము మేనమామల కుండదుగావున నేదియో విధమునఁ గాలముఁగడపుచు సంస్కృతాంధ్రముల నభ్యసించుచుంటిని. మేనమామలును నాయందుఁ బ్రేమగల

వారై యుండుటను పదునాల్గువత్సరములు వచ్చుసరికి వివాహితునింగా నొనర్చిరి. వివాహముతో విద్యావిఘ్నము తటస్థించి జీవితచారిత్రము సంపూర్ణముగ మారిపోయినది. అనేక దుర్మార్గములం జేయ మొదలిడితిని. కర్మఫల మనుభవింపక తీరునదికాదు గదా!

సీ॥ మేనమామలమాట ♦ మీరి స్వతంత్రించి
తిరిగిన దానికి ♦ వరలు ఫలము
శాస్త్రముల్ పఠియించు ♦ సందర్భములయందు
గురు నలక్ష్యముం జేయ ♦ వరలు ఫలము
దుర్మార్గ సాంగత్య ♦ దోషభూయిష్ఠత
వర్తించినందుచే ♦ వరలు ఫలము
సాధ్వీమణీదత్త ♦ సద్బోధనం బెల్ల
నిరసించినందుచే ♦ వరలు ఫలము
లోక దూషణ మొదవించి ♦ చీకుంగూర్చె
నింక నెట్టుల జరియింతు ♦ హీనవృత్తి
నన్య సత్కీర్తిమార్గమే ♦ జూడనొదవు
దానిబోధించి మించెడి ♦ ధన్యుండెవండు॥

నేడు మేనమామలు గృహమునుండి వెడలనడచిరి. ఇంక ముందేదిదారి? (ఆలోచించి) నాకుందోచు కళత్రము. విద్యావిహీనునకు బ్రవర్తనా రహితునకు వివాహ మేల? పదునాల్గవ వత్సరమున నా వివాహము! ఈ వివాహమునుంది పురుషుల కిచ్ఛాధీనమే గాని విధ్యుక్త కర్మముకాదు. గురుసన్నిధిని శాస్త్ర పఠనానంతరము సెలవుంగైకొని శరీరయాత్రార్థము తన కిష్టమగుయాశ్రమమును స్వీకరింపవలయును. అతి బాల్యముననే వివాహమై జీవిత చారిత్రము మారిపోయిన నాయట్టి దుర్మార్గునకు గత్యన్యమేమియుండును?

(రామకృష్ణునిభార్యయగు మానవతి ప్రవేశించును.)

మాన — నాథా! వివాహముఁజేసికొనుట కూడనిపని యనియా యభిప్రాయము? బాల్యవివాహము దోషమే యగుఁగాక — యిహపరసుఖముల నపేక్షించువారందరు ననుకూలవతియగు భార్యను పొందియుండు టావశ్యకము.

రామ — ప్రేయసీ! సర్వజనులును నిక్కాలమున సుఖమనుభవింపవలె ననియే వివాహముఁ జేసికొనుచున్నారుగాని సుఖమునకు మారు దుఃఖమునే యనుభవించుచున్నాను. ఇపుడెందుల కీమాటలు ఈ విద్యాగారమున కేలవచ్చితివి?

మాన — నేటిదినము మీ మామగారు కోపించిరని విని యుపాయమును సూచించి వారికోపమునకు గురికాకుండఁ జేయదలఁచితిని.

రామ — ఏమది?

మాన — ఏమియును లేదు. మా నాయనగారు మిమ్ములను గొనిరావల సినదిగా లోగడనే సెలవిచ్చియుండిరి. ఇది యుక్తసమయము. పోదమని చెప్పవచ్చితిని.

రామ — మామగారి గృహమునకు నేను వచ్చుటయా! అది గౌరవ కార్యముకాదు. దుర్మార్గుఁడగు భర్తను చేఁబట్టితివి. నీ శీల మెట్లు రాణించును? వలయునెడల నీవు పొమ్ము. మేనమామ గారు కోపించినమాట యదార్థము. ఐదునారువత్సరములు దాఁటిన సుతుని హితునివలెఁ జూచుట మానవ ధర్మము. నా దుర్మార్గముల నాయన భరింపకుండుటలో దోషము లేదు. నీ ప్రవర్తనాబలము కారణముగా నాకు శుభదినములు రాక పోవు. ఇఁకమీఁద దుర్మార్గుల స్నేహముల బరిత్యజించి సన్మార్గమునకు రాయత్నింతును, చిన్నతనములో బట్టుపల్లెయను గ్రామమునందుడు భట్టురాజుల సాంగత్యమున సంస్కృతాంధ్రముల సాహిత్యమును కవిత్వ కౌశలమును సంపాదించుకొంటిని.

ఇపుడు వానికి మెఱుఁగుబెట్టి జీవనోపాయమును కల్పించుకొని యెదను. భయములేదు. నీవు పోయిరమ్మా.

మాన—మిమ్ములవీడి సంచరింతునా? తామిక్కట్టుల ననుభవించు చుండ నేను సౌఖ్యము ననుభవించుటయా? నేనును మీవెంట నుందును.

రామ—ఈ కాంత నన్నువీడిచరియించ ననుచున్నది. కర్తవ్యమేమి? (ఆలోచించి) ఈరాత్రి మేనమామతో బ్రసంగించుటచే ఘటిల్లు మేలులేదు. వేకువనేపోయి యాయనను క్షమాపణ వేఁడు కొందును. క్షమాపణ వేఁడుకొనిననేగాని యీకాంతకు గృహ మున తావులేదు. మానవులకు సంసారాదులు బంధముల వంటివి.

(సేవకుఁడొక యోగితోఁ బ్రవేశించును.)

సేవ—స్వామీ! ఈ స్వాములవారు నేటిదినమున మనగృహమునకు వచ్చియుండిరట. మీతో నేదియో సంభాషించుట కిల్లు పంపి యున్నారు.

(సేవకుఁడు నిష్క్రమించును.)

రామ—(సమీపించి) స్వామీ! నమస్కారము. దయచేయుఁడు.

మాన—అయ్యా! మానవతి ప్రణామము లాచరించుచున్నది.

యోగి—దీర్ఘాయుష్మాన్భవ. యోగిఫలప్రాప్తిరస్తు. కుమారా! నేటి నుండియును సద్బుద్ధివై నీ చరిత్ర యెల్లయెడల వ్యాపింపఁజేయు దువుగాక. ఈ బాల నీయర్ధశరీరముకాదా!

రామ—చిత్తము.

యోగి—రామకృష్ణా! పరస్పరవిరోధముఁగల ధర్మార్ధకామముల నొకచోఁగూర్చుసూత్రము కళత్రము. ఈ సమయమం దిట నుండఁదగినది. యోగదృష్టిని నీ చరిత్ర మామూలాగ్రము

గ్రహించితిని. నీకింక భయములేదు. సంస్కృతాంధ్రములయం దారితేరితివి. దీనికిఁదోడు దైవబలమును వాంఛనీయమగును. నీ పవిత్ర నడవడిక - చక్కఁబడుటకు, నీకీర్తి నల్దెసలఁబ్రాకుటకుఁ గాళికామంత్ర ముపదేశింతు నిటురమ్ము. (అని చెవిలో నేదియో చెప్పి) స్త్రీ పురుషరూపములు గానిదియును, జగన్మాతయని పేర్కొనఁదగినదియును, నానారూపముల బొందినదియును, బ్రహ్మాదులచే నుతింపఁబడినదియును నగు నా పరదేవత పుష్పములయందు ఘ్రాణేంద్రియమాత్రగోచరమగు పరిమళమువలెనే త్రిగుణరహితమగు తేజస్సునందు వ్యాప్తించిన తేజోమయస్వరూపమై హరిహరాదులకైనను సుఖదుఃఖముల నొసంగ సామర్థ్యము గలది. నీ వుపాసించిన నీ యీపవిత్ర నడవడిక మారుటయేగాక జ్ఞానోదయంబై యానందమును బొందఁగలవు. ఈమంత్రమును మూఁడుకోట్లమారులు జపించితివేని యాదేవి యనుగ్రహించి నీకుఁ బ్రత్యక్షమై నీయభీష్టముల నెరవేర్చును. తెలిసినదా? అట్లు చేయుదువా?

మ—చిత్తము. తమ యాజ్ఞానువర్తినై మెలఁగెదను.

(నమస్కరించును)

యోగి—కాళికావరప్రసాది నగుదువుగాక. పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

రామ—ప్రేయసీ! మేనమామగారికి నాయం దనురాగము తప్పియుండ లేదు. వాని యనుగ్రహముననే యోగి నాకు కాళికామంత్ర ముపదేశించినాఁడు. ఇప్పటికే జాగైనది. కాళికాలయమునకు బోయి మదభీష్టముల నెరవేర్చుకొని మరలివచ్చెదను.

(నిష్క్రమించును)

నీవే మానసనీమనిల్చెదవ యే • నీకా నేను సచ్ఛిలినై
స్త్రీవిద్యారుచి పద్యమాలికలలో • చిత్రింతు లోకేశ్వరీ॥

ఉ॥ లోకములకా గృహాదికము • లోన విహారమునల్పు తల్లితా
చేకొని నాదు ప్రార్థనము • చెంతకురాఁగ యలభ్యముందునే
నాకమహీజమేకనెడు • నట్టిదె భాగ్యముగల్గె కోర్కులకా
యేక్రియదీరఁబోవు భ్రమ • యేటికి ధన్యుఁడ కాళిదాసుఁడకా॥

కాళి—అభీష్టఫలసిద్ధిరస్తు కుమారా! జాగేలచేసెదవు? నీకు వలయు వరమెయ్యదియో కోరుకొమ్మ.

రామ—తల్లీ! విచారింప నినుఁబోలు మహాత్ములను చూచినవో నేమి కోరవలయునో తెలియనివాఁడను. అనుగ్రహించి నీవే సెలవిమ్మ.

కాళి—రామకృష్ణా! నా వామదక్షిణకరంబుల మెరయుచున్న స్వర్ణరజతపాత్రములఁ జూచితివా? ఇందొకదానియందు బాలును రెండవదాన బెరుగును నున్నయవి. వీనిఁ గోరినవారలకుఁ గ్రమమ్మున విద్యయును నైశ్వర్యమును చేకూరును. ఇందొక్కదానిని యనుగ్రహింతును. కోరుకొమ్మ.

రామ—(తనలో) విద్యనేరనివాఁడు, పశుతుల్యుఁడుగదా? సాధారణముగా విద్యాచణులను, దారిద్ర్యయము బాధించుచుండును. కావున విద్యకును, నైశ్వర్యమునకును సంబంధముండినయే తీరవలయును. ఈరెండును కోరదగినవియే (ప్రకాశముగా) అమ్మా! నాకు వీనియందలి విశేషము తేర్పరింపరాకున్నవి. దయయుంచి యీ చషకయుగమును నాచేతనుంచి చూచుకొననిచ్చెదవేని కలతెలుఁ గెలుఁగించెదను.

కాళి—చూచుకొమ్మ. (గిన్నెలనిచ్చును)

(రామలింగఁడు దధి క్షీరమ్ముల పానముజేయును.)

కాళి—(కోపముతో) ఆ! దుర్మార్గుఁడా! వలదాగుము.

రామ—తల్లీ కోపమేల? రెండును రుచ్యంబులే ఇందొనర్చిన దోష మేమియున్నది. పుచ్చుకొనుటకుగాదా యిచ్చితివి.

కాళి—దోషమా! మదాజ్ఞోల్లంఘన మొనర్చుటయే. నీవు విద్వాంసుఁడ వయ్యును వికటకవి వయ్యెదవు. నీ కృషికిఁ దగినఫల మనుభవింపవైతివి. ఐశ్వర్యయుతుఁడవయ్యును నిర్ధనునివలె జరియింతువుగాక.

రామ—తల్లీ! అపేక్షణీయములను రెంటినిఁజూపి యందొక్కటి మాత్రమె యొసంగెదననుట న్యాయమా? నాయజ్ఞానమును, సైరింపుము. తనయుని తప్పులను తల్లులు మన్నింపకుందురా? నీకన్న నాకు దిక్కెవ్వరు? నీకోప ముపసంహరించు కొనవేఁడుచున్నాను.

(అని పాదములపై బడును)

కాళి—(అనుగ్రహించి) వికటకవివయ్యును రాజసభాభూషణంబవయ్యెదవు. రాజసన్మానమును గాంచెదవు. పొమ్ము.

రామ—తల్లీ! మహాప్రసాదము.

శా॥ ఆయోగీశ్వరునాసయుక్ పిహితభా ♦ ర్యామేయరాగంబునున్
సిగ్గుం గీర్వచన ప్రభావమునునౌ ♦ నిక్కంబుగా హేతువుల్
నాయీపాపము భస్మమౌటకు మదం ♦ బా యింకసద్బుద్ధినై
యోగిస్థానము వాసయోగ్యమగు నం ♦ దేయుందు మోక్షార్థినై॥

సెలవు గైకొందును.

(రామలింగఁడు నిష్క్రమించును)

(కాళికాదేవి యంతర్ధానమగును)

తెరపడును.

---

కాళికాదేవి చషకయుగమును గొనివచ్చి వీనియందు విద్యాధనము లున్నవన యర్థముగానివానివలె నటించి చూచియిచ్చెదనని యబద్ధముబల్కి వానిఁగల పాలును, పెరుగును గ్రోలితిని. ఆదేవి యందుల కాగ్రహించి వికటకవి వగుదువుగాక యని శపించినది. అంత నాదేవిని బ్రసన్నము జేసికొంటిని. రాజసన్మానమును గాంచునటులను రాజసభాభూషణుఁడ నగునటులను వరమిచ్చినది.

మాన—సంతోషమే. కాని పండితులను పోషించురాజు లిప్పుడు లేరుగదా? అన్యదేశీయు లీదేశపురాజుల ననేకవీరులలోఁబరుచుకొనినారు. అందున నిది దౌర్జన్యయుగము.

రామ—ఈ మహమ్మదీయయుగము దౌర్జన్యయుగమని సూచించితివి. నిక్కమే. దోషముల సహితము గుణముండును. గజినీమహమ్మదు ధనకాంక్షను సోమనాథాలయముఁ బాడుజేసెఁగాక. మహమ్మద్ గోరీ రాజ్యకాంక్షను పృథ్వీరాజాదులఁ బోకార్చి యుత్తరహిందూస్థానమున కీర్తిపతాకను నెలకొల్పెఁగాక. అల్లాయుద్దీనుఁడు వింధ్యపర్వతములనుదాఁటి దక్షిణహిందూదేశమునఁ బ్రథమమునకాలిడి మహారాష్ట్రి కాకతీయ భల్లాణ సామ్రాజ్యములపైఁ గత్తిగట్టెఁగాక. ప్రవాహమై వెల్లివిరియు మునల్మానుసైన్యములను బలరహితుల నొనర్చుటకు బుట్టినదియే యీవిజయనగరసామ్రాజ్యము. మాలికాఫర్ తనదండయాత్రాఫలము కారణముగా హరిహరరాయనికి యానగొంది రాజ్యమిచ్చి తనదారినబోయెను. హరిహరబుక్కరాయు లిరువురును కాకతీయరాజ్యములోనివారు. ఆనగొందిముట్టడిలో యీసోదరు లిర్వును మాలికాఫరున కొకగుహలో లభించిరి. అంత నాహరిహరరాయఁడు విద్యారణ్యస్వామియను నాప్రాంతమున సంచరించు మహామునిమాట ననుసరించి, తుంగభద్రకు దక్షిణమున నగరమును నిర్మించి యాస్వామిపేరనే విద్యానగరమని

వీరిడి యారాజ్యమును పాలించిరి. దానిని ప్రస్తుతము కృష్ణరాయఁడు పాలించుచున్నాఁడు.

సీ॥ నిఖల పృథ్వీరాజ ♦ నివహంబు నోడించి
దిగ్విజయంబునఁ ♦ దేలుకతన
మ్లేచ్ఛవాహినిమేర ♦ మీరనీయక కృష్ణ
నరికట్టి క్షేమంబు ♦ నరయుకతన
రాష్ట్రీయవాసులు ♦ రామరాజ్యంబన
పాలించి కీర్తిని ♦ బడయుకతన
కావ్యనిర్ణేతయై ♦ కవికుంజరంబుల
పోషించి కళలను ♦ బ్రోచుకతన

గీ॥ సకలలక్షణ లక్షితుల్ ♦ సార్వభౌముఁ
డీతఁడంచును బల్కుఁడు ♦ రెండువినిన
నగరనామంబు సత్పాల ♦ నంబువలన
నార్థకమయ్యె నటనుండ ♦ సార్థకమ్ము॥

శీఘ్రముగ విద్యానగరమునకేగి రాజప్రాపకమును సంపాదించి నాడను. కృష్ణరాయఁడాంధ్రభోజుఁడు.

సరా — కృష్ణరాయఁడు ఎంతిసామర్థ్యముఁ గలవాఁడా! నేటితో మన కష్టములు గట్టెక్కినవన్న మాటయే. పోయిరండు.

(రామలింగఁడు నిష్క్రమించును.)

మాన — (కాళిక నుద్దేశించి)

గీ॥ మాంపకేవేశ నాథుని ♦ మనమునందు
నిలచియుండుము శారదా ♦ నిలయమందు
వివిధశాస్త్రిలగల్గెడి ♦ విలువజూపి
విజయలక్ష్మిని గ్రహియింప ♦ వెడలుచుండె॥

(నిష్క్రమించును.) (తెరపడును.)

ప్రథమాంకము.



న్నాను. కాని పోవునప్పుడు తాతాచార్యుని గెలచివచ్చితినను ఖ్యాతి మాత్రము నాకుండవలెను. నేచెప్పిన ట్లొనర్చెదవా లేదా?

తాతా—(తనలో) వీఁడు నాయాశ్రయము వదలిపోయెద ననుచు న్నాఁడు. నేనుకోరున దదియేగదా? (ప్రకాశముగా) ఓయీ! నీవలనఁ జాలబన్నములఁ బడుచున్నాను. నీ యిష్టమైనపనిని నాచేఁ గొనిపొమ్ము.

రామ—అటులైన—(ఆగి) తాతా! నన్ను నీమూపున నిడుకొని మాయింట డించవలయును

తాతా—(తనలో) వృద్ధుఁడను. నేను వీనినెట్లు మోయఁగలను. అట్లొ నర్చనైతినేని వీఁడు నన్నువదలిపోఁడు. (ప్రకాశముగా) రామ కృష్ణా! అటులనే కానిమ్ము.

(రామలింగఁ డాచార్యుని భుజములపై నెక్కి పోవుచుండును.)

(కృష్ణరాయఁడు ప్రవేశించును.)

కృష్ణ—(ఆచార్యునుద్దేశించి) గురూత్తమా! ధర్మము ననుసరించి నిత్య కృత్యముల నిర్వర్తించుకొనినంత

శా॥ ఉద్యానంబున మిమ్ముఁగాంచ మదిలో ♦ నూహల్ జనింపగ నే
విద్యాసాగరమువీడి వాఙ్మయ సుధా ♦ వీచీసరః క్రీడకుఁ
బద్యస్వస్తి ఘటించి వచ్చితిని వ ♦ ర్షాకాలవేళాస్తి సం
సద్యోగంబున మానసంబునకు హం ♦ సంబాగతెంబొనటుల్॥

(పరికించి) గీ॥ అదిగొ! కనుఁగొమ్ము కనుఁగొమ్ము ♦ అజ్ఞుఁడెవఁడొ
గురువు నదలించి వీపుపై ♦ కూరుచుండి
పోవుచున్నాఁడు, చూచితే ♦ పోయివానిఁ
బట్టుకొనిరమ్ము సూతుఁడా ♦ యెట్టులైన॥

సూతు—చిత్తము. (సూతుఁడు నిష్క్రమించును)

(ఆచార్యుని భుజములపై నెక్కి రామలింగఁడు ప్రవేశించును)

రామ—(తనలో) కృష్ణరాయఁడు నాకొఱకు సూతునిబంపుచున్నాఁడు. రాయనిమూలమున ముప్పువాటిల్లును. ఇట్టిపరిస్థితుల నేను చదివిన జ్యోతిషము నన్ను కాపాడదా? (క్రిందికిదిగి ఆచార్యుని కాళ్లపైఁబడి) తాతా! నాయపరాధమును క్షమింపుము. నా ప్రవర్తనము నాకే భయదాయకమయ్యెను. దోషపరిహారము నకుఁగాను తాము నాభుజములపై నెక్కుఁడు. (ఆచార్యుని భుజములపై నెక్కించుకొనును)

సూతు—ఏమి నీదౌష్ట్యము? కృష్ణరాయలవారు వాహ్యాళికై వచ్చియున్నారు. పైవానినిఁ గొనిరా నాజ్ఞయిచ్చినారు. రమ్ము. (ఆచార్యునితో సూతుఁడు నిష్క్రమించినయంత రామలింగఁడు నిష్క్రమించును.

(తాతాచార్యుఁడును కృష్ణరాయఁడును చెరియొకవైపునుండి వత్తురు)

కృష్ణ—ఆచార్యునిఁజూచి తనలో) ఔరా! గురుద్రోహినైతిని. నాకింక తారకమేది? (ప్రకాశముగా) గురువరా! నాయపరాధమును క్షమింపుఁడు. ఇంతకుబూర్వము మూపుపైనున్నది మీరు కాదే?

తాతా—రాజచంద్రా! ఆతఁడు రామకృష్ణుఁడను చిన్నవాఁడు. తెనాలివాస్తవ్యుఁడు. నీప్రాపుగోరివచ్చి నన్నాశ్రయించినాఁడు. ఉభయభాషలలోనను కవిత్వముఁ జెప్పఁగలఁడు. జ్యోతిషముఁగూడ తెలియుననుచున్నాఁడు. రాజాశ్రయమునకు సాయపడినవాఁడ గానని నాపై కోపగించి భయపెట్టి పరాభవించినాఁడు.

కృష్ణ—(కోపముతో) సూతుఁడా! ఆదుర్మార్గుని గొనివచ్చి నీకరవాలమున శిరమునరుకుము. పొమ్ము.

సూతు—చిత్తము. (నిష్క్రమించును)

కృష్ణ—గురువరా! చీకటులు క్రమ్మనున్నవి. మన మికపోవుదము రండు.

(నిష్క్రమింతురు)

తెరపడును.

---

ద్వితీయరంగము.

రంగము—విద్యానగరసమీపమందలి మఱ్ఱివృక్షము.

(ఒంటరిపాటున వెంకటశాస్త్రియను బ్రాహ్మణుఁడు ప్రవేశించును.)

వెంకట—ఈదినమింకను పురాణపఠనము ప్రారంభింపనికారణ మేమై యుండును? రాయలవారు రాలేదేమి? ఆచార్యుఁ డేఁడీ! (అటు నిటు చూచి) ఇంకొకచో నేర్పాటుజేయ నవకాశములేదే? మఱ్ఱివృక్షము నీడననిగదా నిన్నటిదినము చాటించియుండిరి. ఇంతవఱ కెవరును వచ్చియుండలేదు. (మరలచూచి) రావయ్యా! శివరామశాస్త్రీ! రా!

శివ—ఓహో! శాస్త్రులవారు దయచేసినారే! మంచిపోవుసంభాషన మేమి యునులేదు. నన్ను పిలువకయే వచ్చినారేమి? ఇంకా హడావిడి లేదేం ?

వెంకట—హడావిడా? తాతాచార్యుఁ డొకకాలములో గొప్పసంస్కృత పండితుఁడైతే కావచ్చును. కాని ప్రబంధకవిత్వము బయలు దేరినదినములలో ఆచార్యునిముఖము జూచువా రెవరు? విను వారెవరు?

శివ—అట్లనరాదు. తాతాచార్యుఁడు గొప్పవిద్వాంసుఁడు. సంస్కృత కవి. మనవారు చదువుచుండు "సాత్త్విక బ్రహ్మవిద్యావిలా సము" నకు గ్రంథకర్త ఆచార్యులవారే. ఈయన జన్మస్థలము

కాంచీపురము. అప్పయ్యదీక్షితులవారు శివాంశముచే బుట్టిరని చెప్పినట్లే యితఁడు విష్ణ్వంశచేతఁగల్గెనని యిప్పటివారు వాకొనుచున్నారు. ఆచార్యునకు భయమేమియున్నది? రాయఁ డాచార్యునిచేతిలోని కీలుబొమ్మ. ఇతరకవు లాతని నేమిచేయఁగలరు?

వెంకట—పిచ్చివాఁడా! ఆశక్తి యితరులకు లేకపోవుఁగాక. నిన్ననో మొన్ననోవచ్చిన రామలింగఁడనిన నాచార్యుఁడు భయపడును.

శివ—నిన్ననో మొన్ననోవచ్చిన రామలింగడనిన నాచార్యుఁడు భయపడునా? ఇఁకమీాద రామలింగని భయముతీరినది. పరలోకవాసియైనాఁడు.

వెంకట—శాస్త్రీ! పొరబాటు పడుచున్నావు. రామకృష్ణుఁడు సజీవుఁడై యున్నాఁడనువార్తను నీవు వినియుండలేదా?

శివ—ఏమీా! రామలింగఁడు వధమును తప్పించుకొనినాఁడా? ఎట్లు?

వెంకట—భటులు రాజాజ్ఞననుసరించి వధమునకు గొంపోవుచుండఁగా వారికి దియ్యనిమాటలుజెప్పి లంచమిచ్చినటులనమ్మించి మేకను జంపి దానిగ్రుడ్లను రాజునకు జూప వారి నొడబరచి వధమును తప్పించుకొనినాఁడు.

శివ—బాగు బాగు. యదార్థమై యుండవచ్చును.

వెంకట—అదే తాతాచార్యుఁడు శిష్యసహితుఁడై వచ్చుచున్నాఁడు.

(ఆచార్యుఁడు శిష్యునితోఁ బ్రవేశించును)

వెంకట—ఆచార్యులవారూ! నమోనమః.

తాతా—(తనలో) సమయమునకు శివరామశాస్త్రికూడ వచ్చినాఁడు. స్మార్తులతో మాటలాడుటయన్నను, వారిఁ జూచుటయన్నను నాకు బ్రాణముపోయినట్లుండును. (అని ముఖము ప్రక్కకు తిప్పుకొనును)

వెంకట—శివరామశాస్త్రీ చూచితివా? మనలనుచూడ నిష్టములేక ఆచార్యుఁడు త్తరీయమును ముఖమునకుజాటు బెట్టుకొనుచు న్నాఁడు. ఈయనకు స్మార్తులముఖముఁజూచిన గాడిదపుట్టుక రాఁగలదు.

తాతా—శిష్యా! పురాణపఠనము ప్రారంభింతమా! ప్రేక్షకులు చాల మంది వచ్చియున్నారు. అలస్యము చేయరాదు.

(నులోనముల బెట్టుకొని)

“శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణ చతుర్భుజమ్।
ప్రసన్నవదనంధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే॥
ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం॥

అబ్బాయీ! నిన్నటిదిన మెంతవఱకైనది?

శిష్య—శ్రీమన్నారాయణుఁడు దేవకీగర్భస్థుఁడగుటవఱకు సెలవిచ్చి యున్నారు.

తాతా—మంచిది. నేటిదినము హరివాసరము సమయమునకును కృష్ణ భగవానుని యవతారఘట్టము ప్రారంభమైనది. చెప్పునది కృష్ణ చరితము. వినునదియు కృష్ణస్వరూపమే?

శివ—అయ్యా! చెప్పెడివారో

వెంక—శివరామశాస్త్రీ! చెప్పెడివారా! వైష్ణవాగ్రేసరచక్రవర్తి శ్రీమాన్ విద్వాన్ తిరుమల తాతాచార్యులవారు.

తాతా—(పరికించి) తయారైంది రకం. పురాణశ్రవణం మోక్షాపేక్షకు సూచకం అనేకాలముపోయి ఆసమయంలో ప్రయోజనములు తీరఁగలవనేకాలంవచ్చింది. అయ్యా! శాస్త్రిగారూ! తమబోటి పెద్దలే పరమానందయ్యగారి శిష్యబృందంలోచేరితే కాలక్షేప మేరీతిసాగుతుంది.

వెంక—లేదు లేదు. ప్రేక్షకులు నిశ్శబ్దముగనేయుందురు. శివరామ శాస్త్రీ! మాట్లాడరాదు.

తాతా—"నిశీథేతమ ఉద్భూతే జాయమానే జనార్దనే
దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణుస్సర్వగుహాశయః
ఆవిరాసీద్యథా ప్రాచ్యాందిశీం దురివపుష్కలః॥
తమద్భుతం బాలకమంబుజేక్షణం
చతుర్భుజం శంఖ గదాద్యుదాయుధం
శ్రీవత్సలక్ష్మాంగళశోభి కౌస్తుభం
పీతాంబరం సాంద్రపయోద సౌభగమ్॥

(అంత సభలో రాళ్లుపడును.)

తాతా—ఏమిటీరాళ్లు? నాసమక్షముననే యింతయాగడమా? నిన్నటి దినం రామలింగనికి జరిగినపరాభవం స్ఫురణయందుండి యుండ లేదా? ఎవ్వరి దీదుష్కార్యం. శిష్యా! ఈపని వెంకటశాస్త్రి దేనా?

శిష్యు—స్వామీ! కాదు. ఈరాళ్లు యీవృక్షముపై నుండి పడినవి.

వెంక—శాస్త్రీ! చూచితివా? ఈసభలో నిందరుండఁగా ఆచార్యుని మీదనే రాళ్లుపడినవి. ఈయది కృష్ణమాయ. (ఆచార్యుని చూచి) స్వామీ! ఈమహీరుహమున నొక్కపక్షియైనను లేదు. ఈరాళ్లెట్లు పడినవో?

తాతా—రామకృష్ణుఁడు దుర్మార్గుఁడు. చచ్చియును పిశాచమై బాధిం చుచున్నాఁడు. ఐహికవాంఛలు తీరమి బ్రహ్మరక్షస్సైనాడు. సందేహములేదు.

(అంత మంటలుకానవచ్చును.)

అదిగో! పెద్దమంటలుకూడ బయలుదేరినవి. తప్పక యిది భూతకృత్యమే. కాదందురా?

వెంక—ఆచార్యులవారూ! కాదు. కాదు.

తాతా—కాకపోవుట యేమి. దయ్యమైనాఁడు. సందేహములేదు. శిష్యా! వీరితో మనకేమిపని. నేటికి బురాణమునులేదు గిరాణణమునులేదు. రమ్ముపోవుదము. భూతమారణోపాయ మాలోచింతము.

(ఆచార్యుఁడు నిష్క్రమించును)

వెంక—ఈరామకృష్ణుని కపటనాటకమునందు భూతమారణోపాయ మాలోచించువానివలె నటించి కొంతతంత్రమునడిపి ధనము గణింతము రమ్ము.

శివ—వచ్చెదనుగాని మన కథానాయకునినామము రామకృష్ణుఁడా! లేక రామలింగఁడా?

వెంక—ప్రారంభమున నీతనికి రామలింగమనియే పేరుండెను. బాల్యము నుండియును. చాటుపద్యములవ్రాయు నలవాటుపడి యందు రామలింగమనియే వ్రాసికొనినటుల యీక్రిందిపద్యమువలన తెలియుచున్నది.

ఉ॥ "లింగనిషిద్ధుఁగల్వల చె ♦ లింగనిమేచక కంధరుంద్రిశూ
లింగని సంగతాళించె ♦ లింగని కట్టుడుపూపిరంగా స్తుతా
లింగని, కృష్ణచేలునిహ ♦ లింగని గేలకచేఱవిధాత్మనా
లింగని, రామలింగకవి ♦ లింగనికీర్తి హసించుదిక్కులఁ."॥

ఒక కాలంలో లింగమతస్థుఁడైతే కావచ్చును. బలవంతముగా జనులనుబట్టి చక్రాంకణాదులజేయుచుండు తాతాచార్యునిచేతిలోఁబడిన కారణమున నాయన వైష్ణవమత మిప్పించియేయుండును. లేకున్న యిక ముందైనను తప్పదు. తాతాచార్యులవారిముద్ర భుజముతప్పినను వీపు తప్పదను నామెతను నీవువినియుండలేదా? మన మిక రామకృష్ణుఁడనియే పిలువవచ్చును. రమ్ముపోవుదము. (నిష్క్రమింతురు.)

## తృ తీ య ర ం గ ము.

రంగము—కృష్ణరాయని యాస్థానము.

[కృష్ణరాయఁ డుపవిష్టుఁడై యుండును]

కృష్ణ—ఇది యేటి యన్యాయము. ఈకార్యమున కేమికారణముం డును. ఆసమయమున నట్టికోపమేలవచ్చినది.

మ॥ సమరక్ష్మాస్థలి గెల్పుచేకురి జయో • త్సాహంబు సంధించుచో
అమలంబై నమతిన్ పరాఙ్ముఖునకే • నత్యంత సుప్రీతిమై
తమరాజ్యంబు గ్రహించుఁడంచొసగినా • ధర్మంబు కాపాడెదన్
సమరాంతంబున నైరివర్గమును నే • నాథించ నుర్వీశ్వరుల్॥

అట్టినాకు

చ॥ గురుని పరాభవించెనను • కోపదవానల మల్లనాఁడు నన్
పరమ దురాగతంబునకుఁ • బాల్పడఁజేసి కులీను నక్కటా
శిరమును దీయనాజ్ఞ నిడ • జేసెను నీ యది బ్రహ్మహత్యయే
కరమరుదైన కార్యమిది • కాఁగల వారిలొ సిగ్గుచేటగున్॥

అకుణ్ఠుఁడును నైహికవాంఛలుతీరమి బ్రహ్మరక్షస్సాయెనని లోకులు చెప్పుకొనుచున్నారు. బ్రహ్మరక్షస్సు కులాంతమునకుఁగాని చలము విడువదు. తన్నారణోపాయమునకు మాంత్రికుల ననేకుల నియమించితిని. కాని లాభము లేకపోయినది. (సేవకుఁడు ప్రవేశించును)

సేవ—దేవరదర్శనార్థ మెవ్వఁడో యోగీశ్వరుఁ డరుదెంచినాఁడు.

(ఘంటానాదము వినఁబడును.)

కృష్ణ—బహిఃద్వారమున గంటను మ్రోయించుచున్నాఁడే యతీశ్వరుఁడు. పండితులకుఁగాని నాదముఁజేయుట కుత్తరువులేదుగదా? (విని) మఱల మఱల చేయునాదమునుబట్టి యీతఁడు పలు

శాస్త్రముల నెఱింగినవాఁడని తోచుచున్నది. భద్రా! వారిని శీఘ్రముగ లోనికిఁ గొనిరమ్ము.

(సేవకుఁడు నిష్క్రమించును)

(రామకృష్ణుడు యోగివేషమున ప్రవేశించును)

కృష్ణ—యోగిసత్తమా! కృష్ణరాయఁడు నమస్కారము లాచరించుచున్నాఁడు.

రామ—చిరయశఃప్రాప్తిరస్తు. భయరహితోస్తు. రాజకుమారా! నీవు హరివాసరోత్సవము జరుపుచున్నాఁడవను వార్తను విని యిటకు వచ్చి యాయుత్సవమును తిలకించి యపుడుజరుగు విశేషముల కానందించి నేను వ్రాయుచున్న స్వర్గవిశేషదర్పణమునందలి విశేషములను వినిపించి పోవలయునని యత్నించితిని. కాని రా.జాలనైతిని. సమయము మీరిపోయినను తమ దర్శనమైనను చేసి పోవలయునని వచ్చితిని.

కృష్ణ—(తనలో) స్వర్గవిశేషదర్పణమను గ్రంథరాజమా? కావ్యప్రపంచమునసట్టి పేరుగలపొత్త మీవఱకెవ్వరిచేతను రచింపఁబడియుండలేదు. ఇద్దానిభావము బోధపడుటలేదు.(ప్రకాశముగా) అయ్యా! ఇందలి విశేషములేమి?

రామ—ఈయది మంత్రశాస్త్రమును బోధించు యుద్గ్రంథము. తమ బోటి రారాజులు పోషింపఁదగినది.

కృష్ణ—ఇందు రెండుమూఁడు పద్యములను చదివి భావమును విశదీకరింతురా!

రామ—చిత్తము.

ఉ॥ శ్రీజగదంబ పాదసర • సీరుహదివ్య మరందపాన వి
భ్రాజిత వాక్సుధాకలిత • పద్యసుగద్యములన్ వచింతు నం

పూజిత సర్వభావములఁ ♦ బూర్తిగ స్వర్గ విశేషదర్పణం
బాజయ రామయోగికృత ♦ మౌనిదియంచన నెల్లవారలున్॥

కృష్ణ—(తనలో) ఉపక్రమణమునకు ముందు కాళీస్తోత్రమును ప్రారంభించినాఁడు. అందున్నను రామయోగి కృతమనుచున్నాఁడు.

గీ॥ ఈకృతివిలాసముల నెన్న ♦ నేమొగాని
రామకృష్ణుండె జ్ఞ స్తి ♦ రాఁదొడంగె
అతఁడె కాకున్న కాళికి ♦ నాదియందు
భక్తి నభివర్ణనముఁ జేయు ♦ వాఁడెవండు॥

అతని బోలినవారెందరుండరు? (ప్రకాశముగా) అయ్యా! ప్రారంభమునుండియును చదువనవసరములేదు. మధ్య నొకటి రెండు విషయములను జదివినఁ జాలును

రామ—అట్లులనే జేసెదను.

ఉ॥ భూతములున్నవంచును న ♦ బోధపుఁగల్పనలెన్నొ జేసి యే
భూతములేని యే ♦ ధనము ♦ మోఘముగా గొనజూచుచుందురా
భూతపుమాంత్రికు ల్గని ♦ భూతకులోద్భవులెవ్వరేని దద్
ఘాతముఁ గాంగ నమ్ముదురె ♦ భూరివివేకులు జూచి మెత్తురే॥

కృష్ణ—(తనలో) రాజులు భూతములఁగాంచి భయభ్రాంతులు కారనియును, భూతములు లేవనియును మాంత్రికులు భూతములను నెపముపెట్టి ధనము గ్రహింతురనియు నభిప్రాయమును గన్పరిచినాఁడు. నిశ్చయముగా నిది రామలింగని తంత్రము కావలయును. స్వర్గవిశేషదర్పణము నాకు పిశాచములు కారణముగా సంభవించు భయము నడ్డొత్తించు గ్రంధరాజము కావలయును. విచారింప నితఁడు రామలింగఁడే కావలయును. ఇంకను పరీక్షించి చూచెదఁగాక.

సేవ—(ప్రవేశించి) దేవరదర్శనార్ధ మల్లసానిపెద్దన వచ్చియున్నాఁడు.

కృష్ణ—శీఘ్రముగ లోనికిఁ బ్రవేశపెట్టుము.
సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

(అల్లసాని పెద్దనకవి ప్రవేశించును.)

కృష్ణ—కవిచూడామణీ! అభివాదనములు.

పెద్ద—దీర్ఘాయుష్మాన్భవ. రాజేంద్రా! తాము కోరినయట్లు పద్యమును పూరించి తెచ్చితిని.

కృష్ణ—ఏదీ! ఇటు తెండు. (పత్రమును పుచ్చుకొని)

మ॥ శరసంధాన బలక్షమాది వివిధై • శ్వర్యంబులంగల్గి దు
ర్భరమండత్వ బిలప్రవేశచలన • బ్రహ్మాఘ్నుతల్ మానినన్
నరసింహక్షితి మండలేశ్వరులనె • న్నన్వచ్చు నీసాటిగా
నరసింహక్షితిమండలేశ్వరుని కృ • ష్ణా! రాజకంఠీరవా॥

ఇందలియర్థము బాగుగలేదు. పునరుక్తిదోషమున్నదే?

రామ—తాతా! బిలముజొచ్చినను రాజకంఠీరవా రమ్మని తోకఁబట్టి వెలికీడ్చుచున్నావు. దోషముకాదా? అయ్యా! తామిట్లు పద్యమును కోరుటయందలి యభిప్రాయము?

కృష్ణ—రామకృ (అర్ధోక్తిలో) అయ్యా! ఈపట్టమునగల వరాలను నిర్దోషముగ పద్యముజెప్పిన వాడికిచ్చెదనంటిని.

రామ—అయ్యా! రామాయని సంబోధించిపిలుచుట మానినారు. రామశబ్దమును యోగిశబ్దమును శ్రేష్ఠార్థమును బోధించునవియే. నన్ను రామయోగియన్నను దోషములేదు. అద్దానికేను ప్రయత్నము జేయనానా?

కృష్ణ—అయ్యా! అట్లనే కానిండు.

రామ—

మ॥ కలనన్ తావకఖడ్గఖండితరిపు • క్ష్మానాథ రక్త మార్తాండమం
డలభేదంబొనరించి యేగునెడత • న్మధ్యంబునన్ హారకుం

దల కేయూరకకిరీటభూషితుని శ్రీ • నారాయణుంగాంచి లో
కలగంబారుచునేగె నీవయును కం • కన్నృష్ణరాయాధిపా॥

కృష్ణ — ఔరా! కవనమా లేక యిది యమృతమా? ఈశ్వరసాక్షాత్కారముఁ గాంచినవారికి సాధ్యముఁగాని విషయముండునా? నీవు రామకృష్ణుఁడవే. గెలుపొందిన యీ వరాలపళ్ళెముఁ గైకొని నా కానందమును గూర్పుము. మరియును కోపావేశమున తెలియకచేసిన తప్పులను మన్నింపుము. మదాస్థానమున పండితపీఠ మలంకరింపుము.

రామ — అయ్యా! రామకృష్ణకవిని నేను గాను.

(ఆతురతతో తాతాచార్యుఁడు ప్రవేశించును.)

తాతా — రాజా! నా కొంపమునిగినది. రామకృష్ణుఁడు సజీవుడై యున్నాఁడు. నిన్నటిదినము మాయింట ధనము నెత్తుకొనిపోయి నాఁడు.

కృష్ణ — గురూత్తమా! ఏమి యీతొందర. అసలువిషయమేమి?

తాతా — విషయమేమున్నది. రామకృష్ణుఁడు జీవించియున్నమాట యదార్థము.

కృష్ణ — ఎట్లు? రామకృష్ణుఁడు వధింపఁబడెను గాదా?

తాతా — వధమునులేదు గిధమునులేదు. తప్పించుకొనినాఁడు. ఈ యీచార్యునకు రామకృష్ణునిమూలమున పరాభవములు తప్పవు. తాతాచార్యునికొఱకే రామకృష్ణుఁడు పుట్టినాఁడు. జీవించి యున్నాఁడు.

కృష్ణ — అయ్యా! జీవించియున్నటుల నెట్లు నిరూపించగలరు?

తాతా — నిరూపించుటయే కష్టకార్యమా? నిన్నటిదినము మాయింటికి వచ్చినాఁడు.

కృష్ణ — ఎందులకు?

తాతా—నన్నాశ్రయించినపుడు సమాశ్రయణముఁ జేయించుకొనినఁ గాని రాజదర్శన మిప్పించనని బెదరించియుంటిని. అప్పుడాతఁడు శైవమతమునందలి యభిమానమును విడువజాలకపోయెను. ప్రస్తుతపుఁ బరాభవము విష్ణ్వంశసంభూతుఁడగు యాచార్యుని బరిభవించుటచే గలిగినదని తెలిసికొని సమాశ్రయణము జేయించుకొనుటకు వచ్చినాఁడు.

కృష్ణ—మతము నిప్పించితిరా ?

తాతా—లేదు లేదు. ఘుమ్మక్కొందునని నమ్మించి లంచముఁ బుచ్చుకొని పారిపోయినాఁడు ఈ విషయమును మీకు తెలుపవచ్చితిని.

రామ—(తనలో) ఈదుర్మార్గునకింకను మతాభిమానము నశించలేదు మఱియొకపరి తగిన పరాభవము జరుగవలయును.

కృష్ణ—గురూత్తమా ! ఎంతపని జఱిగినది? ఆ ధనమును బొక్కసమునుండి తీసికొనుట కనుజ్ఞనిచ్చితిని. (రామలింగనిఁజూపి) ఈ వ్యక్తిని గుర్తింపఁగలరా ?

తాతా—(చూచి) రామకృష్ణుఁడే! రామకృష్ణుఁడే! దొంగదొరకినాఁడు.

కృష్ణ—పండితాగ్రణీ ! ఇంకేలదాచెదవు ?

సీ॥ వధియింపబంపను ♦ వలనుగా తప్పించు
కొను ప్రజ్ఞయేరికిఁ ♦ గొమరుమిగులు
తప్పించుకొన్నయం ♦ తనపిశాచంబుగా
భయపెట్టఁజాలిన ♦ ప్రాజ్ఞుఁడెవఁడు
భయము నావలద్రోసి ♦ భక్తినినెలకొల్పు
శక్తిగల్గిననేటి ♦ సరసుఁడెవఁడు
శక్తిగల్గిననేమి ♦ యుక్తియుక్తంబుగా
కవితఁ జెప్పఁగ గల్గు ♦ ఘనుడెవఁడు

కవిత జెప్పినసేమి యా ♦ కాళికనటు
నిష్టపూజించి మించెడి ♦ నిపుణుఁడెవఁడు
గురుఁడె తా సాక్షియై నిన్ను ♦ గుర్తుఁబట్టె
యేలదాచెదవయ్య నీ ♦ లీలలిపుడు ॥

నే నొనర్చిన మహాపరాధమునకుఁ బశ్చాత్తాపమంది యారీతిని వధింపఁబడిన హతభాగ్యుఁ డెవ్వఁడని విచారింపఁగా కాళికానుగ్రహ పాత్రుఁడనైన నీవ యని తేలె. ఆసమయమునుండియును లజ్జాన్వితుఁడనై యటొనర్చినందులకు విచారించుచుంటిని. శోకాంతమాయె. సంతోష మొనఁగూడు.

గీ॥ భాగ్యవశమున నిన్ను నే ♦ బడసినాఁడ
భోజు నాస్థానముననుండి ♦ బొల్పుమీరి
కాళిదాసుండు విఖ్యాతి ♦ గాంచినటుల
గారవమునంద నీవును ♦ గడగుమయ్య॥

రామ—అయ్యా! ఇంకను దాపరికమేల?

సీ॥ అతిబాల్యమున తండ్రి ♦ యంతరించినయంత
మేనమామలుపెంచి ♦ మేలుఁజేయ
బట్టుపల్లియలోని ♦ భట్టురాజులు ప్రేమ
కావ్యకన్యకనిచ్చి ♦ గారవింప
యోగీశ్వరుఁడు దివ్య ♦ యోగసూత్రముఁ జెప్పి
కాళికాధ్యాన సం ♦ కల్పుఁజేయ
అద్దేవి సత్కృపా ♦ ప్రాప్తి దర్శనమిచ్చి
వలయుకోర్కులు దీర్చి ♦ ప్రతిభలొసఁగ

గీ॥ స్థితికి మూలంబు విష్ణుసం ♦ సేవనంబు
విష్ణువే నిశ్చయము భూమి ♦ విభుఁడటంచు

తలఁచి మిముఁజేరి యెంతయు ♦ ధన్యుఁడైన
రామకృష్ణుఁడితఁడె కృష్ణ ♦ రాయచంద్ర॥

కృష్ణ—(కౌగలించుకొని) కవిశిఖామణీ! ఇప్పటికి చాలతడవైనది. నేటికి సభ చాలింతము. ఇకనుండి మదాస్థానమున పండితుఁడవై యుందువుగాక.

రామ—చిత్తము.

(కృష్ణరాయఁడు రామలింగనితో నిష్క్రమించును)

తాతా—రామకృష్ణుఁడికమీఁద యాస్థానములోనివారినిత్రోసిరాజనును.

(నిష్క్రమించును.)

(తెరపడును.)

ద్వితీయాంకము.



శ్రీ

# తెనాలి
# రామకృష్ణ చరిత్రము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

రంగము—తాతాచార్యునియిల్లు.

(తాతాచార్యుఁడును, ధూర్జటియును నుపవిష్టులై యుందురు)

తాతా—ధూర్జటికవిచంద్రమా! నేఁడుమనయాస్థానములో విద్వత్కవి ఁనియును,వికటకవిననియును యొవనుఁడొకఁడు ప్రవేశించినాఁడు చూచితివా?

ధూర్జ—రామలింగఁడేకదా?

తాతా—అగును. (తనలో) పాదుప్రయోగము. రామలింగఁడు.

ధూర్జ—సంతోషమే. ఎంతవాఁడెంతవాఁడుగా మారినాడు!

సీ॥ శాస్త్రపాఠముమాని ♦ చరియించునాతఁడె
          శాస్త్రపండితుఁడయ్యె ♦ చతురుఁడయ్యె
    వైవాహికమటన్న ♦ వలదన్న యాతఁడె
          పత్నీవశుండయ్యె ♦ ప్రాజ్ఞుఁడయ్యె
    దైవభక్తియటన్న ♦ భావమూననివాఁడె
          కాళీవశుండయ్యె ♦ కవియునయ్యె
    దుర్మార్గసాంగత్య ♦ దోషభూయిష్ఠుండె
          యాదర్శియాయెను ♦ యాఢ్యుఁడయ్యె

గీ॥ కావ్యకన్యక వరియింప ♦ దివ్యతముఁడై
హాస్యరసపోషణంబున ♦ నతిశయించి
యశముగణియించిమించు న ♦ త్యంతముగను
కాళికాదేవి కరుణించి ♦ కానెనితని॥

తాతా—అయ్యా! బాల్యమున దోషియేయగుగాక. "వక్రుండైన జనుండు వృద్ధగురుసేవంజేసి మేధావయోవిక్రాంతి న్విలసిల్లు" అన్నారు పెద్దలు.

ధూర్జ—రామలింగని కీ కవిత్వకౌశలం తమ శిష్యత్వమంగీకరించినందు వలన వచ్చినదందురా?

తాతా—కాదామరి. అందులకు రెండుకారణములు. కొంతకాలము నాశిష్యత్వమంగీకరించుటయును, అనంతరము సమాశ్రయణముఁ జేయించుకొనుటయును.

ధూర్జ—పాపము. (తనలో) యీదుర్మార్గపుటాచారము అనుభవములో పెక్కుతావుల కానవచ్చుచున్నది. అదియేమిదోషమో గాని పేరుప్రతిష్టలగణించువారిఁజూచి తమకాధిక్యతను కల్పించుకొనుటకు వారు మాశిష్యులేయనియును, యసమర్థుఁడు నే నా జగద్విఖ్యాతుని శిష్యుఁడనియును చెప్పుకొను ఆచారముగలదు. ఒకపురుషుఁడు ప్రసిద్ధుఁడగుటకు మానసికశక్తియును యోగమే కారణములగుఁగాని యన్యములు కానేరవు.

తాతా—ఏదియో యోచించుచున్నారు?

ధూర్జ—తమమాటలగల్లు యదార్థమును చింతించుచున్నాను.

తాతా—అభిప్రాయము తేలినదా?

ధూర్జ—ఆ రామలింగఁడు యోగపురుషుఁడగుటకు కళత్రపుఁబాతివ్రత్యమును కాళికాశీర్వాదమునుగాని కారణములు; మీాతత్వత్రయ నిరూపణముగాదు.

తాతా—నీతో వాగ్వాదమెందులకు? "నిజము దైవమెఱుఁగు. నీరు పల్లమెఱుఁగు" అన్నారు పెద్దలు. అధారం రసజ్ఞులకు వదిలితే బాగుంటుంది. ఆంధ్రకవితాపితామహుఁడనని యల్లసాని పెద్దన్నయును, ముద్దుపల్కుఁబల్కు నేర్పుగలవాఁడనని ముక్కుతిమ్మన్నయు, ద్వ్యర్థికావ్యకర్తనని సూరన్నయును తక్కుంగల రామభద్రశంకర కవులును మిక్కిలి గర్వించి యున్నారు. నే ననుభవించితినిఁగాన చెప్పుచున్నాను. ఇక మీరందరును రామలింగని చూచుకొనుచు జాగ్రదావస్థయం దుండవలసినదే.

(రామలింగఁడు కళత్రయుతుఁడై ప్రవేశించును.)

తాతా—నాయనా! రామకృష్ణా! ఎప్పుడు వచ్చితివి? యీబాల నీ కళత్రముగాదా?

రామ—స్వామీ! ఇదియే మారాక. ఈగ్రామమున నిప్పటికొప్తులు మీరేగదా?

తాతా—అగునగును. మన గురుశిష్యసాంప్రదాయములు యితరుల కబ్బిన ప్రమాదం వస్తుంది.

(తిమ్మరుసుమంత్రి ప్రవేశించును.)

తాతా—మంత్రిసత్తమా! మీరాకకు కారణము? ఇట్లొంటరిగ పాదచారులై వచ్చితిరేల?

తిమ్మ—ప్రభువులు మిమ్ములఁ గొనిరమ్మనినారు.

తాతా—ఏఁడులకు ?

తిమ్మ—బుక్కరాయాదులకాలమునుండియును విజయనగర విజాపుర రాజ్యములకు సరిహద్దు కలహములుండి మన సాళ్వనరసింహునికాలమునుండియును విజాపురము విజయనగరములోఁ గల్పుకొను నాలోచనలు జరిగి యిప్పటికే దులశాహి నోడించుటాయెను.

తాతా—బాగు బాగు. నిరంతరవిజయములు కారణముగా మన నగరము సార్థకనామమును బడసినది. రాయనియట్టి ప్రజ్ఞాశాలురకు స్వాధీనముగాని విషయముండునా ? అమ్మాయీ! నీవు లోనికిఁ బొమ్ము. (మానవతి నిష్క్రమించును.)

తిమ్మ—రాయఁడిందు గెలచియును చిక్కుపడినాఁడు.

తాతా—ఎట్లు ?

తిమ్మ—యుద్ధమున రాయని సైనికులు సుల్తానునిచే బందిఁ జేయఁబడిరి. ఆకారణమున గెలచినవాఁడయ్యును వారిని బరిరక్షించుటకుఁగా సంధికియ్యకొనవలసివచ్చెను.

తాతా—అంత నేమాయె?

తిమ్మ—సంధిషరతులు సరళముగనేయున్నవిగాని యొక్కటిమాత్రము రాయనికంతమునకు తెచ్చిపెట్టినటులున్నది.

తాతా—అంతటి విషమవిషయ మేది?

తిమ్మ—విజాపురసుల్తానుఁడు బహామనీవంశస్థుఁడు. ఈ బహామనీవంశస్థుల కాదికాలమునుండియును ఆంధ్రకవుల నాదరించుచు వారు రచించిన ప్రబంధముల కృతినందు నాచారము గలదు. కొలఁది కాలమునకుఁ బూర్వము నాదెండ్ల అప్పయామాత్యుని కుతుబశాహీ తపతీసంవరణోపాఖ్యానమును వ్రాయఁబ్రోత్సహించి దానిని కృతినందెను. అటులనే యేదులశాహి సంధివచనములలో వారమునదినములలో భారతమును శ్లేషకావ్యముఁగా రచించి యందు తమ్ము పాండవులుగను వైరివర్గాధీశుని నిజాముల్ముల్కునః కౌరవేయునిగ సూచింపవలసినదిగను కోరుకొనియెను. మన రాయఁడును అసాధ్యమనక గౌరవభంగమునకు జంకి యొప్పుకొనెను.

ధూర్జ—సచివాగ్రణీ! భారతమును రచించుట సాధ్యకార్యముకాదేమి?

తిమ్మ—ఇందలి రహస్యమేమో నేనెఱుఁగను. రాయఁడొప్పుకొనినంత నిన్నటిదినము పండితాగారమున ప్రశ్నింపఁగా ప్రబంధకవులమని విఱ్ఱవీగువారు కుతంత్రములఁబన్ని గౌరవము దక్కించుకొనిరి. పితామహుఁడుమాత్రము తన బిరుదమునకు భంగమువచ్చునని యర్థాంగీకారమును సూచించినాఁడు. తమరా కవిసార్వభౌము నకు సాయపడగలరా?

తాతా—వారికి తగుసావకాశము లేదనియే భావించెదను.

ధూర్జ—ఎందువలన?

తాతా—శివపూజయగుసరికి లింగోద్భవకాలము. అనంతరమెన్ని పను లుండవు.

ధూర్జ—మంత్రిసత్తమా! ఆచార్యుఁడు హాస్యగాఁడు. భారతము రచించుకార్యమీయననలననే కావలయును. తీసుకొనిపోండు.

(నిష్క్రమించును)

తాతా—అగునగును. మీరు పండితులరు. నేను వృద్ధుఁడను. మా శిష్యుడు రామకృష్ణుఁ డీపనినిజేయును. (రామలింగని దూరముగా గొనిపోయి, రహస్యముగా) రామకృష్ణా! యదార్థముఁ జెప్పుచున్నాను. భవానియనుగ్రహమున భారతమును పూరించు శక్తి నీలోనున్నది. పెద్దనయును నిన్నాశ్రయించును. ఈ కార్యమును చక్కఁజేసి యాస్థానపుఁగౌరవము కాపాడుభారము నీది.

రామ—చిత్తము.

తిమ్మ—స్వామీ! వీరినామధేయమేమి?

తాతా—ఈతఁడు తెనాలివాస్తవ్యుఁడు. రామకృష్ణుఁడనియెదరు. ఆస్థానమున నూతనముగాజేరిన విద్వత్కవి. కాళికానుగ్రహ పాత్రుఁడు.

తిమ్మ—అట్లనా? పితామహునకు సాయపడఁగల సమర్థుఁడా?

రామ—స్వామీ! నాశక్తి నిదానముమీఁద యువాగతము కాఁగలదు. పెద్దనార్యుఁడీపని చేయలేఁడు. ఇంకను జెప్పుచున్నాను. నేనొక రుఁడనుగాక యన్యులీపనిని నమర్థింపనేరరు.

తిమ్మ—అటులైన రాయనికార్యము నెరవేరినట్లే. గురూత్తమా! వీరి నీఁగూడ వెంటఁగొనిరండు.

రామ—చిత్తమట్లనే రాఁగలము. మేమాస్థానమున కరుదెంచుసరికి తాటియాకు మువ్వలను విశేషముగా సిద్ధపరచియుంచుఁడు.

తిమ్మ—మంచిది. పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

రామ—గురూత్తమా! మనము లోనికిఁబోవుదము రండు.

తాతా—పోవుదముగాని, రామకృష్ణా! వారములోన భారతము నెట్లు వ్రాయఁగలవు. చెప్పుము?

రామ—తాతా! శిష్యుని సామర్థ్యము తెలసియు ప్రశ్నింతురేల? మాయోపాయమున.

తాతా—ఏమిచేయుదువు? భారతమును వ్రాయవా?

రామ—మీరు ఛాందసులు చెప్పిరయేతీరవలయునా? అట్లైన వినుఁడు. భారతము రచించితినని బొంకి యందొక యనుమానము కల్గిన దని సమర్థింపఁజాలని యొకవిషయమును చెప్పి నాప్రశ్నమునకు నమాధానమిచ్చిననేగాని చదువనందును.

తాతా—ఏమావిషయము?

రామ—భారతమున ద్రౌపదికి నైదుగురుభర్తలనియును సుల్తానుఁడం గాక సుల్తానుని కళత్రమునకు మిగిలిన నల్వురుభర్తలనెటనుండి దేవలయునన ప్రశ్నింతును. దాన నాతనికి భారతముపై విరా గము కల్గి మనభారము తీరును.

తాతా—బాగుబాగు. మనకార్యము నెరవేరినట్లే. రమ్ముపోవుదము.

(నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము

రంగము—రామలింగనియిల్లు.

[మానవతి ప్రవేశించును]

మాన—జన్మమెత్తినదాది నరునకు నాల్గుదశలనియుండుటను మార్పులు చిత్రగతుల కల్గుచున్నవి.

సీ॥ తోడివారలఁగూడి ♦ దురితముల్ పతిసేయ
చెడియె జీవితమంచు ♦ చింతఁజెంది
కళ్యాణరూపిణి ♦ కాళికాదేవితా
దారిఁజూపిన యంత ♦ తేరికొంత
శ్రీరాగయుతమైన ♦ శ్రీకృష్ణు సభఁజేరి
తృష్ణతీరంగ సం ♦ తృప్తిజెంది
దర్బారునకుఁవచ్చి ♦ దర్పోద్ధతులగెల్చి
నగరనామముగాన ♦ ననవరతము

గీ॥ ఆటపాటల భానము ♦ లతిశయింప
పెల్కులోనన యమృత ♦ మొల్కుచుండ
గడచుచున్నది జవిత ♦ కాలమిటుల
జాతకపు జాడదెలియఁగ ♦ జాలరెవరు ॥

ఇంతటి సౌఖ్య మనుభవించుకాలము రాఁగలదని తలఁచి యుండలేదు. బట్టుపల్లెయందలి యీదుష్టవర్తనమునకును యిప్పటి యీపరిశుద్ధ ప్రవర్తనమునకును యించుకేని సంబంధము లేదు. భవాని యనుగ్రహముననే

చ॥ వికటకవిత్వనైఖరుల ♦ విశ్రుతిఁగాంచి పితామహాదులన్
ప్రకటితశక్తిమై గెలిచి ♦ ప్రాజ్ఞతమీరి యశంబుగాంచుటల్

సకలసుఖానుభోగముల ♦ సారము గోలుచు తృప్తిపొందుటల్
సకలకళావిచక్షణుని ♦ నాయము నర్ల సభలోనికీర్తియున్॥

కాని

ఉ॥ సాధునివర్తనంబును న ♦ నారతముర్ల చెదుఁగాదలంతురీ
యాధునికుల్ యదార్థమును ♦ నారయ దోషము కానవచ్చునే
గాధలు పెక్కులున్న యవి ♦ కాఁగలవారు యదార్థమందు రే
సాధనమై గ్రహించితి న ♦ సాధ్యుఁడు, సాధ్యుఁడుగాఁడు యేరికిన్॥

హాస్యరసమును మేళవించి దేశమునకు గావించుచున్న జ్ఞానోప దేశము కొనియాడఁదగినది. ప్రవర్తిల్లు విషయములయందలి గుణదోష ములను రాజునకుసైతము నిర్భయముగా నిరూపించి చూపుటయే యాతనిస్వభావమునందలి విశేషగుణము. అట్టివాని నీశ్వరదూతగా పరిగ ణింపవలయును. అల్పుఁడనుట ప్రాజ్ఞులమతముగాదు. అశేష శేముషీ ధురంధరుఁడు.

(రామలింగఁడు ప్రవేశించును.)

రామ—అభిమానము పెంపున నేదియో గుణవర్ణనముఁ జేయు చున్నావు? అనురాగము దుష్టత్వమును బహిర్గతము చేయునది కాదు.

మాన—లేదు లేదు. యదార్థమునె వచించితిని. మీరు భారతమును రచించి యశముఁగొంటిరా?

రామ—ప్రేయసీ!

గీ॥ గుణవతివి నీవు నాదగు ♦ గుణము నెరిఁగి
సర్వవిధముల సౌఖ్యంబు ♦ సంతరింప
ఆదిశక్తియె కాపాడ ♦ ననవరతము
జయమెయంచును ప్రశ్నముఁ ♦ జేయనేల॥

కాని నాజీవితమునకు లోకులు కాకులని యనుటకు కళంక మాపాదించుచున్నారు.

మాన—దుష్కాలమున గుణము దోషముగ కానవచ్చుట సహజమే. మీ రాస్థానమునజేరి స్వల్పకాలమైనది. ఆస్థానమునఁగలవారు మిమ్ముల్లను గ్రహించియుండలేదు.

రామ—లేదు లేదు. ఆస్థానమున నన్నుగుర్తెఱుఁగనివారు లేరనియే చెప్పవచ్చును. ఆస్థానముననేగాదు. ఈ యాంధ్రావనిని జన్మించిన ప్రతివారును యుగ్గుఁబాలతోడనే రామలింగని తెలుసుకొనుచున్నారు.

గీ॥ ఆదినాచార్యు గర్వంబు ♦ నణచియంత
పెద్దనార్యుని ప్రతిభకు ♦ దిద్దిలోటు
భారతముప్రాసి రాయని ♦ ప్రాపువడసి
కవులభయపెట్టి జయమును ♦ గాంచినాఁడ॥

ఇప్పుడు ధూర్జటికవీంద్రుని గెలువఁదగు యవకాశముకల్గినది.

మాన—ధూర్జటిని గెలుచుటయా? ఎట్లు?

రామ—రాజు ధూర్జటిని గూర్చి

"స్తుతమతియైన యాంధ్రకవి ♦ ధూర్జటి పల్కుల కేలగల్గె నీ యతులిత మాధురీమహిమ!" యను నభిప్రాయముతో ప్రశ్నించి యావృత్తమును పూరింపుఁడనిరెను. అట్లనే యని పదునేను దినములు గడువుఁ గైకొనివచ్చితిని. అందులకుగాను వ్యూహమును బన్నుచున్నాఁడను.

మాన—ప్రయత్నము ఫలించినదా? రాజు ననుసరించి ప్రజలుందురు. కళలను పోషించురాజులు గలకాలమున సాధకులు ప్రముఖులు గాకుందురా? జయమునకు సందేహామేమియుండును.

రామ—భవాని యనుగ్రహమున నేను కలవిషయమెఱిఁగి పద్యమును పూరింతును. సందేహములేదు. అనుకూలవతియగు భార్యగలవాని కిచ్చుటనే స్వర్గమువలె నుండును. నిన్నుగూర్చి విశేషము చెప్పనక్కఱలేదు. నీవర్తనము లోకవిదితము. నీకొకరహస్య విషయముఁగూర్చి చెప్పవచ్చితిని. రాజు ప్రజల కష్టసుఖము లెఱింగి వర్తింపవలయును. ప్రజలును రాజక్షేమమును వాంఛించు టత్యవసరము. నేను రాయని ప్రాపువడసితిని. అతని ప్రవర్తనము చక్కఁజేయవలసియున్నది. రాచకులజనితులు చాల మంది కామపూరితులైయుందురు. కృష్ణరాయనియంతటి ప్రభువర్యుఁడు హేయకార్యములఁ జేయ మొదలిడి వేశ్యాలోలుఁడై చరించుటయేకాక తనయుంపుడుకత్తెయగు శ్యామలను పతివ్రతగా దలంచుచున్నాఁడు. ఈవిషయమున రాయని విముఖునిగా నొనర్చుటయే నాయభిప్రాయము. కావున వేషాంతరము నన్వేషించుచుంటిని. కొంతకాలము నాజాడ తెలియనేరదు. పోయివచ్చెదను.

మాన—మంచిది. మీకుజయముచేకూరును. సేనాకృత్యమును శ్రద్ధమై నిర్వర్తింపుఁడు. పోయిరండు.

(రామలింగఁడు నిష్క్రమించును)

మాన—ప్రథమమున ధూర్జటినిగూర్చినసమస్యను పూరింతుననియును యనంతరము భోగినీపతివ్రతను వంచించివత్తుననియును నాథుడు పోయియుండెను. ఈకార్యమెట్లు పరిణమించునో!

(నిష్క్రమించును.)

# తృతీయాంకము.

## తృ తీ య ర ం గ ము.

రంగము—రామకృష్ణుని యిల్లు.

(స్త్రీవేషమున తాతాచార్యుఁడు ప్రవేశించును)

తాతా—నేటిదినము గండము గడచినది. ఈ రామలింగనితో దినమొక యుగముగా నడచుచున్నది. అందునను నాపైకి నల్లేరుపైకిఁ బోవుబండివలె వచ్చుచుండును. నన్నాశ్రయించినపు డిట్టి తుంటరి యాస్థానమున నుండఁదగినవాఁడు కాఁడని మిన్నకున్న యుక్తిమైవంచించి రాజప్రాపకము సంపాదించినాఁడు. ఇప్పటికి రామలింగఁడు చిత్తఁడియని బాగుగా గుర్తెఱిఁగినాఁడు. దినమునకు లెక్కకుమీఱిన తప్పులెన్నియో చేయుచుండును. ఎచ్చట విన్నను యీ తాతాచార్యునకు జఱిగిన పరాభవములనే లోకులు చెప్పుకొనుచుందురు. ప్రపంచమున కీతాతాచార్యుఁడు లోకువైనాఁడు.

(రామలింగఁడు ప్రవేశించును)

రాము—కాదు కాదు ప్రపంచమునకుగాదు. ఈరామలింగనికి మాత్రము లోకువైతిరి. అందఱును తాతాచార్యుఁడు రాజగురుఁడని చెప్పుకొనుచున్నారు.

తాతా—రామకృష్ణా! నిన్ను బ్రతిమాలుకొనుచున్నాను. ఇంతవఱకు జరిగిన నీ జీవితకాలములో నొక్కదినమైన నీ యాచార్యుని పరాభవింపనిది గలదా? ఎందుల కిట్లు బాధించెదవు?

రాము—తాతా! నిన్ను బాధించుటయే నాకు ముఖ్యకార్యమా? ప్రతి దినమును నిన్ను బాధించుచుంటి ననుచున్నావు. ప్రతిదినపుమాట యేటికి? నేటివిషయమున నాదోషమేదేని యున్నదా? నాయింటికి రావలసినదిగా నిన్ను బ్రతిమాలియుంటినా? వీధివెంటఁ బోవుచు యేగుమ్మముకడ సౌందర్యవతి కానవచ్చునాయను

## చ తు ర్థ ర ం గ ము.

### రంగము—ఉద్యానము.

(శ్యామలయు దాని సోదరియగు సరస్వతియు నను యిర్వురు వేశ్యలు ప్రవేశింతురు)

సరస్వ—అక్కా! చూచితే! అలతామతల్లి చక్కఁగ వికసించిన నయనములతో ప్రక్కనున్న లేమావి నెట్లులముకొనుచున్నదో?

శ్యామ—సోదరీ! దానికై నీవచ్చెరువందనేల? ప్రాయమంకురించిన యంతనే యాధారముఁ జూచుకొనక సృష్టియం దేజాతియైన నుండునా? ఇటుచూడు మాజక్కవముద్దరాలు సాయంతనమైనను నాథుఁ డింకను రాలేదని కాఁబోలు నాపూదామరాకుపై నుండి యాకసమువంక కెటుచూచుచున్నదో. అటుచూడుమా! ఆకలువచెలువ నాథునిరాకకై నిరీక్షింపుచు నూతనాలంకృతయై సోదరియైన పద్మినీకాంతనుచూచి నవ్వుచున్నదోయనునటులెంత మనోహరముగ నున్నదో!

సరస్వ—శ్యామలా! ఇందు నీవు నిక్కముగా పొరఁబడితివిసుమా! పద్మినీకాంత కిందువలనగల్గిన హైన్యమేమియును లేకపోవుటయేగాక గౌరవముకూడ లభించినది. మహాతేజశ్శాలియైన దినకరుని కీల్గాలె లోకబాంధవుఁ డస్తమించినంతనే యతని యాధారమున జీవనమును కల్పించుకొను నిశాచరునకుఁ దన శోభనాలంకార చేష్టలు కానరాకుండ డిందుపరుపనెంచియో లేక దోషాకరుఁడైన పరపురుషునిఁ జూడనిచ్ఛలేకయో, అదిగాక మర్యాదుఁడైనవానిఁ జెట్టఁబట్టి దనవంశమునకుఁ దనకునుగూడ నపకీర్తిఁ దెచ్చిన కలువసంతానమును జూడ మనసుపుట్టకయో పద్మాంగన ముకుళితయై తన సహజపాతివ్రత్యమును వెల్లడించుకొనుచుండ నాపె హాస్యాస్పదురాలెట్లగును?

శ్యామ—సోదరీ! నీవు నిజము వచించితివి. అదే కృష్ణరాయఁడరు దెంచుచున్నాఁడు. పోయిరమ్ము. (సరస్వతి నిష్క్రమించును)

(శ్యామల చెట్టుచాటున దాగియుండును)

(కృష్ణరాయఁడు ప్రవేశించి హటాత్తుగా శ్యామలచేయిఁ బట్టుకొని)

కృష్ణ—గీ॥ కుటిలకుంతలవౌట నీ ♦ కుటిలహృదయ
మలవడెనె నీకు మానినీ ♦ మథితవైరి
రాజమదనాగరుఁడు కృష్ణ ♦ రాయ నృపతి
మోసగింపఁ గోర్కెయే ♦ ముదిత నీకు॥

కుటిలకుంతలవు గావుననే వృక్షముమాటున దాగియుంటివి. కుల కాంత లిట్లొనర్తురా? ఒకవేళ యీకృత్యమేమని యందునా హాస్యమున కట్లొనర్చితినందువు. ఈదినమున రామకృష్ణుఁడు వారకాంతకు విశ్వా సము ప్రేమము ననునవి గలుగజాలవనియును మీశ్యామలయును అట్టిదే యనియు ననియుండెను. ఇప్పటి నీచర్య యాతనిభావమును బల పరచినది.

శ్యామ—మహాభాగా! నాయపరాధములను క్షమింపుఁడు. మూఢు రాలికి కులాచారధర్మము లెట్లు లలవడును. మీరుచెప్పినట్లే కపటవర్తనము మాజాతికి నైజమే.

కృష్ణ—శ్యామలా! ఈమాత్రమునకే క్షమాపణ వేడికొనవలయునా? నేటిదినము విషయవిమర్శనా సామర్థ్యములేని యొక బలరహి తునిపైఁ బంచశరుఁడు పరిశేషముగ నుంచుకొనకయే తన బాణ ముల నన్నిటినిఁ బ్రయోగించినాఁడు.

శ్యామ—మహాభాగా! ఈ శ్యామల మిమ్ములను పంచశరుని బాణము లకు గురిఁజేయునంతటి మూఢురాలుగాదే? కాని సౌఖ్యపడు వారిఁ జూచి సంతసించునంతటివాఁడు కాఁడా మదనుఁడు. చేసిన దోషమేమి?

కృష్ణ—మన సౌఖ్యలతను ద్రెంప సామర్థ్యములేనివాఁడై రామలింగని ప్రవేశపెంచినాఁడు.

శ్యామ—బాగు బాగు. అగ్నిదేవునకు వాయుదేవుఁడు తోడైనాఁడు.

కృష్ణ—పట్టమహిషియగు యన్నపూర్ణ యొనర్చిన దోషమునకు నేను పరిత్యక్తనుజేసిన విషయము స్ఫురణయందున్నదా?

శ్యామ—చిత్తము. జలక్రీడాసమయమున "హేరాజా! మాంమోదకైస్తాదయ" యను శ్లేషయుక్తవాక్యము నుచ్చరించినందులకుఁ గాదా మీరామెను వదలియుండినది. ఇం దన్నపూర్ణ పొరఁబడినది.

కృష్ణ—(తనలో) ఔరా! స్త్రీబుద్ధి ప్రళయము. వారకాంతవుగావున వృక్షముమాటున దాగియుంటివని విలాసముగ బలుక కులకాంత లొనర్చినదేమి యని శ్లాఘించినది.

శ్యామ—ఏమాలోచించుచున్నారు. నాకు దెలియరానిదియా?

కృష్ణ—లేదు లేదు. అంత నామె మన కథానాయకుని రామలింగనిజేరి పునస్సమాగమసుఖముఁ లభింపఁజేయవలసినదిగా కోరియుండ వచ్చును. దాన నాతఁడు నాయెదుర నంతఃపురస్త్రీలకూర్చి మాటలాడ ధైర్యముచాలక యుద్యానవనమున నాచార్యునితో సంభాషించుచుండ నైదుశ్లోకములలో విషయమంతయును నిమిడ్చి యందు నేను తుమ్మెదవంటివాఁడననియును యన్నపూర్ణ మాలతి, జాజి, మొదలైన పుష్పముల సౌరభ్యమువంటి సుగుణ సంపత్తికలదనియును, అట్టిదానిని వదలుట నాదోషము కాదని యును యీశ్వరాజ్ఞయనియును జ్ఞానియగువాఁడు వర్తించవల సినవిధ మదికాదనియును నిరూపించినాఁడు.

శ్యామ—మీ మాటలయందు యదార్థమున్నది. మాటలతో భర్తను మోసముజేసినకాంత క్రియలయందు మోసముఁ జేయకుండునా?

కృష్ణ—శ్యామలా! అన్నపూర్ణ మోసగించినదనియేనా నీ యభిప్రాయము?

శ్యామ—ఇది మోసముకాదా?

(తెరలో రామలింగఁడు)

ఉ॥ మాలతి నెమ్మనంబధిక ♦ మారవశంబయి యొప్పుచుండ నీ
వేలను తుమ్మిపూవకట ♦ యేమి సుఖంబొనగూర్చునంచు యా
లీలను దానిఁ జేరెదు కు ♦ లీనత నెంచక షట్పదంబయా
లోలముదాని మానసము ♦ లోతునెఱుంగక సంచరింతువా॥

శ్యామ—ప్రియా! ఈమాటలు రామకృష్ణునివిగావా? ఈతఁ డీయుద్యానమున కెట్లువచ్చినాఁడు. వచ్చిన దోషమేమున్నది. దినమునకు నూరుతప్పులకు సెలవైనదికాదా?

కృష్ణ—శ్యామలా! అతనిమాటలకు విలువలేదు. సదాదోషములనె వెదకుచుండు కుటిలమతి. ధర్మానాప్రాసియాక తప్పినదికాదు. నిన్నటిదినముసైతమిట్టిప్రసంగములనే ప్రారంభించినాఁడు.

శ్యామ—లోగడ రామకృష్ణుఁడేటికో దూషించెనంటిరి. ఇప్పుడును అదే యభిప్రాయమును సూచించుచున్నారు. అతఁడేదేని నన్ను దూషించియుండెనా? ఆదుష్టుని మనోవీధి నేనేల దగిలితిని?

కృష్ణ—అతనితో నీప్రసంగమేలవచ్చును? కవులు స్వతంత్రులుగావున నతఁడే లోకములోని వేశ్యాకులమును దూషించుచు మాటల సందర్భమున నన్యాపదేశముగ శ్యామల పతివ్రతగాదను విషయమును సూచించినాఁడు.

శ్యామ—అందులకు మీరేమి సమాధానముఁ జెప్పితిరి?

కృష్ణ—కాదుకాదు. మాశ్యామల అట్టినడవడికలది కాదంటిని. ఇఁక నీవ జాగరూకురాలవై సంచరించవలయును. ధర్మానాసహో

యముగా యంతఃపురమున బ్రవేశించి సర్వత్రవర్తనుఁడైనను చమత్కారముల నుపచరించు స్వభావము కలవాఁడై యుండుట నెట్టిమోసములఁ జేయునోయని యనుమానము గల్గుచున్నది

శ్యామ—స్వామీ! యీశ్యామల రామలింగని కపటవేషముల గ్రహింపఁజాలని యసమర్థురాలుగాదు. ఇట కరుదెంచెనేని తగిన మర్యాదజేయుదును.

కృష్ణ—చాలపనియున్నది. పోయివచ్చెదను రామలింగని నొకకంట కనిపెట్టియుండవలయును.

(నిష్క్రమించును)

తెరపడును.



శ్రీ

# తెనాలి రామకృష్ణ చరిత్రము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

రంగము—ధూర్జటియింటి వీధియరుగు

(రామకృష్ణుఁడు బిచ్చగానివేషమున ప్రవేశించును)

రాము— ఈ విషయమున కృష్ణరాయఁ డెంతయును పక్షపాతము వహించినాఁడు. బ్రహ్మచారియట ధూర్జటి! శృంగారరసము వెల్లివిరియ కవనముఁ జెప్పఁగల సామర్థ్యుఁడఁట. నైషధ కావ్య కర్తయగు శ్రీనాథునికన్నను, బమ్మెరపోతనామాత్యునికన్న నీతఁడేపాటివాఁడు ?

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేలగల్గెనో
యతులిత మాధురీమహిమ"

అనిగదా కృష్ణరాయఁ డనియెను. ధూర్జటి స్తుతమతియా? అట్లన్నటికిని కాఁజాలఁడు. ఇది కలియుగము. ఇక్కాలమున మానవుల యందు ప్రివర్తనము సత్పదార్థ ముంతరించినది. పరస్త్రీల కన్నెత్తి చూడనివారు కలరనుమాట యసంభవము. గతరాత్రి స్వప్నసారాంశ మును చూడఁగా, యిప్పటి పరిస్థితులను యోచింపఁగా రాయఁడు వేశ్యాలోలుఁడైయుండుటను, రాజు ననుసరించి ప్రజలుందురు గాన

యీతఁడును దోషియేకావలయును. గతరాత్రి స్వప్నమున కాళికా జనని ధూర్జటిని గెలుచునటుల నాశీర్వదించినది. ఆదేవి యనుగ్రహ మున నీవ్యూహమునుబన్ని ధూర్జటియొనర్చు కృత్యముల రహస్యముగా వెంటనంటిపోవుచు గ్రహించుచుంటిని. ఇంతనఱ కాళిని ప్రవర్తన యందు కళంకము కానరాదు. భవాని యనుగ్రహమున ప్రాతఃకాలము నకు చిక్కుడేని నేను ధూర్జటిని జయింపఁజాలను. రాయలవారి సమ స్యను పూరించి ప్రత్యుత్తరమీయఁజాలను. ఈ కార్యకరణమునందు "రామకృష్ణా! నీవు జయమునందఁగలవని పెద్దనాదు లాశీర్వదించిరి. అట్టి పెద్దలమాట వ్యర్థమగునా? భవానిదయ నాపై తప్పిపోవునా? విధి యెట్లున్న నట్లగును. ఈరాత్రి యీధూర్జటి యింటియరుగుపై విశ్రమించి గృహమునగల్గు విశేషములేవేని గ్రహించెదగాక.

(అరుగుపై విశ్రమించును)

(వీధిగుమ్మమును తెరచుకొని ధూర్జటి ప్రవేశించును)

ధూర్జ—నిశీథము దాఁటనున్నది. రామామణి నాకొఱ కెదురుచూచు చుండును. శీఘ్రముగ దానియింటికిఁబోయి వేకువనే రహస్య ముగా మరలివత్తును. నా యీకార్యము పాపభూయిష్ఠము. రాయఁడు నన్నుఁగూర్చి స్తోత్రముఁజేయుచు యిచ్చిన సమస్య నాస్థానమునఁగలవారిలో నొక్కరును పూరింపఁజాలరైరి. నిశ్చ యముగా

గీ॥ మధిత మధురిమసారంబు ♦ మగువ, మొల్ల
రసములనెసంగు శృంగార ♦ మనదృశమని
శాస్త్రములవ్రాయు పండిత ♦ సమయమెట్టు
లనుభవింపక యవగత ♦ మగును మదికి॥

ఇప్పటికె జాగైనది. (నిష్క్రమించును)

రామ—(లేచి) గీ॥ వారకాంతాసమాలోక ♦ వాంఛమదికి
దగులకుండిననాటికే ♦ ధన్యుఁడతఁడు
కలితకాకలకలనాద ♦ కామినీమ్మ
దూక్తి మదిసోక సోకునే ♦ యుక్తి మదికి॥

బాగు బాగు. కృష్ణరాయఁ డేమనియెను?

"స్తుతమతియై...............మాధురీమహిమ॥—"ఫలము నకుఁ గారణము నిరూపింతునా?

హా! తెలసెఁ॥—(ఆగి) ఎట్లు తెలియగలను. ఈతని సంభాషణ మునుబట్టి నిశాసమయమున తనకై యెదురుచూచుచున్న ప్రియురాలిని కలసికొనఁబోవుచున్నాఁడని తెలియవచ్చుచున్నది. కామాంధులకుఁ గన్నులు కానరావు. తదుపరి చరిత్రమునుగూడ తెలిసికొన్నంతనే సమస్యాపూరణమొనర్తుఁగాక.

(నిష్క్రమించును)

(తెరపడును)

---

## ద్వి తీ య ర ం గ ము.

రంగము—వేశ్యాగృహము.

(రామలింగఁడు ప్రవేశించును)

రామ—ఏమిచిత్రము! లోకమున నేరీతి దుర్మార్గములు ప్రబలుచున్నవి? ఆసేతుహిమాచలపర్యంత మెచ్చటచూచినను గుణము కానరాకున్నది. ఇందు చిత్రమేమున్నది?ఏనాఁ డన్యదేశీయులీ పవిత్ర భూమిని కాలిడిరో నాటనే విషబీజ మంకురించినది. ప్రసర్థము

[illegible] కాలక్రమమున దుష్కర్మములు సత్కర్మము [illegible] మారఁజొచ్చినవి. పరివర్తనము సధర్మానంతర మధర్మ మును, సధర్మానంతరము ధర్మమును కాలానుసరణి ననుసరించి వచ్చుచుండును కాదా? మానవుఁడు కర్మబద్ధుఁడు కాఁడా? దుర్యుగమున జనించినవానికి దోషము గుణముగనే కానుపిం చుట సృష్టిచిత్రము గాదా?

చ॥ కరము వికారమున్నలఁపఁ • గాదగు వస్తుచయంబు కాలవై
ఖరిని మనోహరంబగుచు • గ్రాలుటఁ జూడమె ధాత్రియందునన్
గరళము ప్రాణముల్గొనుచు • కాలమునందు సుధాసమంబుగా
వరలుచు రోగజాలమును • బాపదె యాయువు కల్గియుండినన్॥

ఇట్టి దుష్కాలము మారిపోయి శుభదినములు రాఁగలవు. హృదయరాజమా! ఒకసారి ధూర్జటి వేశ్యాగృహమున నొనర్చుచున్న కార్యమేమియో చూచివత్తము. (తొంగిచూచి) ఏమా కాంత!

మ॥ తనమంజీరని నాదసంకలన చి • త్రంబందు నిద్రించు మా
రుని మేల్కొల్పుచు తన్నుఁజూచుజనులన్ • రుద్ధాత్ములంజేయు క్రీ
గనులంజూచుచు నవ్వులన్ దెలుపుగా • గావించుచున్ మించునే
జనముల్ గోరరు దోషికాఁడితఁడు వే • శ్యావృత్తి దుర్దోషమా॥

ఇంతవఱకు ధూర్జటిమాత్రము దోషి కాఁడు. ఏకపత్నీవ్రతుఁడు. ఈతని దోషము గుణముగనే మారుచున్నది. కృష్ణరాయా! ధూర్జటి కవితయందలి మాధురికి యీవారకాంతయే కారణము. గ్రహించితిని. పాపము బహిర్గతము కాకుండునా? (కవాటము చప్పుడు చేయును)

రామ—(చూచి) ఈశబ్దమునువిని ధూర్జటి యిటే వచ్చుచున్నాఁడు. ఈతని నిప్పుడు పలుకరింపరాదు. మఱల నింటికిఁబోవు మార్గ మధ్యమున కలసికొందును. (నిష్క్రమించును)

ధూర్జ— (ప్రవేశించి) ఈశబ్దమునకు గారణము [illegible] రామా మణియును కవాటమునుండి యెవ్వరో తొంగిచూచినట్లున్నదని చెప్పినది. ఇచ్చట మనుష్యసంచారము కానవచ్చుటలేదు. తెల్లవారనున్నది. (అటునిటుచూచి) జనము నడయాడుకాలము కావచ్చినది. బహుశః కలవరించియుండును. రామామణీ! తూర్పు తెలతెలవారుచున్నది. పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

(తెరయెత్త రామలింగఁడు ధూర్జటి కెదురుగా వచ్చుచు)

రామ—అయ్యా! యెచ్చటినుండి మీరాక?

ధూర్జ—(చూచి) ఎవ రాపిలచునది?

రామ—నేనే. తెనాలిరామకృష్ణుఁడను. ఎచ్చటనుండి చాలవేగిరముగా వచ్చుచున్నారు ?

ధూర్జ— (తనలో) ఈతఁడు నా చరిత్రమును గ్రహింపలేదుగదా ? (ప్రకాశముగా) ఇచ్చటికే పోయివచ్చుచున్నాను.

రామ—ఇట్టి నిశాసమయముల సంచార మెప్పుడు ప్రారంభించినారు ? నే నీరాత్రి చిత్రమైన కలఁగని వాని యభిప్రాయమును అందలి యదార్థమును తెలసికొనవలెనని వచ్చితిని.

ధూర్జ—ఏమది ?

రామ—ఏమియునులేదు. మనయూరి బైటిమేడలోని రామామణితో మీరు సంభాషించుచున్నట్లు కలఁగంటిని.

ధూర్జ—(తనలో) ఔరా ! తుంటరి ! (ప్రకాశముగా) అయ్యా ! కవి చూడామణీ! యీరాత్రి యెట్టి స్వప్నమువచ్చినది. నీవు హాస్య గాఁడవు. రే పుదయమున చెప్పరాదా? అనుష్ఠానము లొనర్చు కొను సమయమైనది. పోయివచ్చెదను. (ముందునకు వచ్చి) యెంతరహస్యముగ సంచరింతమన్నను యీవ్యాపారముల

యితరుల కంటబడుట యదార్థము. నాకుఁదగిన పరాభవముఁ జేసినాఁడు. (నిష్క్రమించును.)

రామ—చెప్పెడివి శ్రీరంగనీతులు. చేయునవి సానియూడిగములు. ఇప్పటికి సమస్యాపూరణమంత కష్టకార్యముగా కానుపించుట లేదు. ఏదోవిధమున ధారానుసరణిని పూరించినచో యందలి భావ మభావమైయుండునుగదా! ధూర్జటివెంటనంటి యాతని చరిత్ర మామూలాగ్రము గ్రహించితిని. ఆతఁడు సామాన్యుఁడా! ఇప్పటికి స్వేచ్ఛమై కవితను నడిపింపఁగలసాహసి యీయాంధ్రావని సీతఁడొక్కఁడే. దురదృష్టమున నీ దుష్కార్యమునకు బాల్పడినాఁడు. మచ్చునకైన నీతనియందు దుర్గుణము కాన వచ్చునా? కృష్ణరాయేంద్రా! ధూర్జటికవితయందలి మాధురీ మహిమ యెట్టిదియో తెలసికొమ్ము.

హా తెలసెఁ భువనైకమోహనో
ద్ధత సుకుమారవార వని ♦ తా జనితా ఘనతాపహార సం
తత మధురాధరాధర సు ♦ ధారసధారలఁ గ్రోలుటఁ జుమీ॥

ఒకవేళ రామకృష్ణుఁడు చమత్కారిగావున నీరీతిఁ బూరించె నందువా ధూర్జటియే సాక్ష్యముఁ జెప్పఁగలఁడు. అన్యు లీసమస్యను పూరింపఁజాలరు. ఇందు రామకృష్ణుఁడే విజయుఁడు.

(నిష్క్రమించును)

(తెరపడును)



## చతుర్థాంకము.

### తృతీయ రంగము.

రంగము—కృష్ణరాయని యాస్థానము.

(కృష్ణరాయఁడు, తిమ్మరుసు, ధూర్జటి, తాతాచార్యుఁడు మొదలగువా రుపవిష్టులై యుందురు)

కృష్ణ—సచివాగ్రణీ! నేఁడు పండితసభయని చెప్పియుంటిమిగదా! రావలసినవారందరును వచ్చినారా?

తిమ్మ—కథానాయకుఁడు రామకృష్ణుఁడుగాక మిగిలిన వారందరును యథాస్థానములయం దున్నవారు.

కృష్ణ—పండితర్షభులారా! ధూర్జటికవీంద్రునిఁగూర్చి మీకిచ్చిన సమస్యాపూరణమునందు కృతకృత్యులరేనా? మీ ముఖలక్షణము లుపలక్షింప మీరు వ్యగ్రప్రయత్నులుగా దోఁచుచున్నది. రామకృష్ణుఁడు పదునేనుదినములు గడువొసంగినచోఁ బూరింతుననియెను. అట్లొయ-టిని ఇందనుక సభకురాలేదు.

(సేవకుఁడు ప్రవేశించును)

సేవ—రాజేంద్రా! నరసకవి వచ్చియున్నాఁడు.

కృష్ణ—శీఘ్రముగ బ్రవేశపెట్టుము. పోయి రామకృష్ణునిఁ దోడ్కొని రమ్ము.

సేవ—మహాప్రసాదము. (నిష్క్రమించును)

కృష్ణ—ధూర్జటికవిచంద్రమా! కాళహస్తీశ్వర మహాత్మ్యమును తెనిగించినందుల కెంతయును సంతసించితిని. మీ యనువాదమింత మార్దవముగ నుండుటకుఁ గారణము మీరైన వచింతురా?

ధూర్జ—దేవరసంకల్పబలమే దీనికిఁ గారణము. ఈకవిజనమండలి యందు నన్ను బేర్కొని యీకార్యమునకు నియోగించుటయే కారణము.

తాతా—కాదుకాదు. రామలింగఁ డాస్థానమున జేరినప్పటినుండియును లింగమతము ప్రబలుటచేత వీరాకును లింగనిమత మనుకూల మగుటను శివదీక్షాపరుఁడైన యీతఁడు వీరాకు రుచించు చున్నాఁడు.

(నరసకవి ప్రవేశించును)

నరస—స్వామీ! తమ యాస్థానమునఁగల పండితులనందరిని జయించి వచ్చితిని. బహూకరింతురా?

కృష్ణ—అయ్యా! పరిశేషముగ మారామకృష్ణులవారు మిగిలియున్నారు. వారితోఁడనుగూడ చర్చ జరిగినయనంతరము బహూకరింతును.

(రామకృష్ణుఁడు ప్రవేశించును)

కృష్ణ—కవిచంద్రమా! ఈయాసన మలంకరింపుము.

రామ—చిత్తము.

కృష్ణ—రామకృష్ణ కవిచంద్రమా!నాయాజ్ఞనుమీరి వర్తించుచున్నావే.

రామ—దేవర యన్నముఁ దినువాఁడను దేవరమాటకు యడుగు దాఁటుదునా?

కృష్ణ—ఇంతెనఁబకేల సభకు రాలైతివి.

రామ—సభ యనుమాట తెలియుదును. రావలెననియును తెలియు దును. కాని రాఁజాలనైతిని.

కృష్ణ—అందులకుఁ గారణము?

రామ—దేవరకుఁ గృతియిచ్చుటకుఁగాను శ్రీపాండురంగని పవిత్రచారిత్రమును స్వర్ణయోగచింతామణియను నొకమహాప్రబంధమును వ్రాయుచున్నాఁడను. అందులో స్వర్ణయోగచింతామణియను పరిబంధమునకుఁగాను కథాక్రమమును సవరించుచుండ పెద్దన—తిమ్మన—రామరాజభూషణుల మనుచరిత్రము—పారిజాతాప

కారణము—వసుచరిత్రములయందలి కొన్ని విశేషములు కాన వచ్చినవి. అందుల కవ్వారి కవిత కచ్చెరువందుచుంటిని.

కృష్ణ—ఏమని?

రామ—పెద్దన

ఉ॥ పాటునకింతులోర్తురె కృ ♦ పారహితాత్మక నీవు త్రోయ ని
చ్చోటల భవన్నఖాంకురము ♦ సోకె కనుంగొనుమంచు చూపి యా
పాటలగంధి వేదన నె ♦ పంబిడి యేడ్చె కలస్వనంబుతో
మీటిన గబ్బిగుబ్బ చను ♦ మిట్టల యశ్రులు చిందువందఁగాన్॥

తిమ్మనార్యుఁడు

ఉ॥ ఈసునబుట్టి డెందమున ♦ హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలియేడ్చె ప్రాణవిభు ♦ కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయి ♦ చేలచెరంగిడి బాలపల్లవ
గ్రాసకషాయ కంఠ కల ♦ కంఠవధూకలకాకలీధ్వనిన్॥

రామరాజభూషణుఁడు,

శా॥ ఆడాబిల్లి వెలుంగు వెల్లికలదో ♦ యన్నేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున పటా ♦ గ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవాననయేడ్చె కిన్నరవధూ ♦ రాజత్కరాంభోజ కాం
భోజీమేళ విపంచికారవసుధా ♦ పూరంబు తోరంబుగాన్॥

ఈ విశేషములఁగాంచి కావ్యకన్యక యేతీరుసుమములచే యలంకరింపఁబడుచున్నదని యాశ్చర్యమగ్నమానసుఁడనై యిటకురా మరచి పోయితిని.

కృష్ణ—రామకృష్ణా! ఇందలి భావమేమియని నీ యభిప్రాయము?

రామ—స్వామీ! అభిప్రాయమేమున్నది? నాకుఁజూడ అల్లసానిపెద్దన్న అంటావిటునేడ్చెనవియుతు ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగ నేడ్చె

ననియును భట్టుమూర్తి బావురని యేడ్చెననియును స్ఫురించినది. ఇందు దోషమేమున్నది?

కృష్ణ—(తనలో) ఔరా! ఈతఁడెంతప్రజ్ఞావంతుఁడు! మదాస్థానపండితుల నందరిని అందునను నేను మెచ్చుకొని గండపెండేరమొసఁగిన పెద్దనార్యుని సహితము తిరస్కరించినాఁడు. (ప్రకాశముగా) రామకృష్ణా! ఆపద్యములయందు నీవు వికటకవివి గావున విచితార్థమును జూపి మాకానందమును గూర్చితివి. అందు దోసమేమియును లేదు............వింటివా? ఈనగసకవి యాస్థానమునగలవారిని గెలిచివచ్చితిననియును బహూకరింపుమనియును కోరుచున్నాఁడు. నీవీతనితో శాస్త్రవాదముఁ జేయవలసియున్నది.

రామ—చిత్తము. అయ్యా! కవిచూడామణీ! ఇంతవఱకు కవిలేఖనంబునఁ బ్రజ్ఞావంతుఁడును తప్పులుదిద్దుటయందు నేర్పరియునగు పండితుఁడు కానరాఁడు. ఈ రెండుపనులును మీరు చేయఁగలరా?

నరస—ఈరెంటిని నేర్వకున్న నేను పండితుఁడ నెట్లుకాఁగలను? వలయునెడల మా శిష్యుఁడే యీపన్నిని చేయఁగలఁడు.

రామ—తమశిష్యుఁడు వెంటలేఁడుగదా? శ్రమపడి పిలువననరసములేదు. లఘువుగనే పోవచ్చును. ఈపద్యమున దోషములున్న నేర్పరింపుఁడు.

మ॥ గననీహారగురామ పద్మ ధళరం • గత్కీర్తిచాణూరమ
ర్ధనశుక్రాక్షి కళేభరాణ్మృగపతీ • త్రైలోక్య దామోదరా
యనగా శంఖరవాంఘ్రితార్థ దగదా • ద్యస్త్రైకపాణే జనా
ర్ధన దానేపకనైరి విగ్రహాము కుం • ధామిత్ర విందాధిపా॥

నరస—ఏమిఁపద్యమిది? అపశబ్దములు కొలఁదిగనే యున్నవే? చాణూరమర్థన, జనార్ధన యిత్యాది పదములు దోషభూయిష్ఠములు.

రామ—(నవ్వి) బాగుబాగు. నరసకవీ! నా పద్యమున తప్పులున్నవా? సభాసదులారా! వింటిరా ఇందు తప్పులున్నవఁట. చాణూరమల్, హనయని విరచి చదువవలయును. (నిర్లక్ష్యభావముతో) ఈవృత్తమున కర్థముఁ జెప్పఁగలవా?

చ॥ తెలియని వన్ని తప్పులని ♦ దిట్టతనాన సభాంతరంబునన్
బలుకఁగ రాకురోరి పలు ♦ మారు పిశాచపుపాడెగిట్ట నీ
వలికిననోట దుమ్ముపడ ♦ భావ్యమెఱుంగక పెద్దలైనవా
రల నిరసింతువా పెగిడ ♦ రాణ్ణరసా విరసా తుసా భుసా॥

చ॥ ఒకని కవిత్వమందెనయు ♦ నొప్పులుతప్పులు నాకవిత్వమం
దొకనికిఁ దప్పుపట్టుపని ♦ యుండదు కాదని తప్పుపట్టినన్
మొకమటు క్రిందుగాఁదిగిచి ♦ మొక్కలుపోనని నిప్పుకత్తితో
సిక మొదలంటఁగోతు మఱి ♦ చెప్పనఁగొట్టుదు మోముదన్నుదున్॥

(నరసకవి సిగ్గుపడి నిష్క్రమించును)

కృష్ణ—కవిచంద్రమా! సంతోషమాయె. సమస్యాపూరణముపూర్తియైనదా?

రామ—చిత్తము. కాని దేవర నొకవిషయమున ప్రార్థించుచున్నాను. తాము కావ్యవిన్నేతలరు. తమకుఁ బ్రత్యేకమెఱిఁగింపవలయు విషయముండదు. రవి యెఱుఁగనిది కవి యెఱుంగును. నేను రచించినపద్యమునుచూచి యానందపడవలసినదేగాని భావమునుమాత్రము విశదీకరింపవలసినదిగా కోరరాదు

కృష్ణ—కవిచూడామణీ! అట్లనే, ఏదీపద్యమును చూపుము.

(రామలింగఁడు కాగితము నిచ్చును.)

ధూర్జ—(తనలో) ఇంతవఱకు నాగౌరవమును దక్కించినాఁడు.

కృష్ణ—(చూచి) ఏమి రామకృష్ణా!, యిదేటి యన్యాయము. కేవలము బ్రహ్మచారిని వేశ్యాలోలుఁడని నిరూపించుచున్నావే? ఇందు లకుఁ గారణము?

రామ—దేవరను కారణ మడుగవలదని యీవఱకే విన్నవించుకొని యున్నాను.

కృష్ణ—మరచితిని. రామకృష్ణకవిచంద్రమా! మరచితిని.

మ॥ లలితాలాపకళాకలాపములకే ♦ లాక్షణ్యు జేయూతగా
దలపోయుఁ జతురాశ్యరాణీకవితా ♦ ధారుండవై భావనం
కలితావాప్తి నెసంగరాట్సభల వి ♦ ఖ్యాతుండవౌమంచునే
విలసత్కీర్తినుతించుఁ గాళికృప నా ♦ వీరుండవల్పుండవే॥

సీ॥ ఆచార్యునదలించి ♦ యాస్థానమునజేర
యత్నంబుజేసిన ♦ యట్టినాఁడు
రామభూషణకృతి ♦ గసనప్రబంధంబు
దోషయుక్తంబని ♦ ద్రోయునాఁడు
సప్తాంగరాజ్యంబు ♦ సంగ్రహించియొసంగి
హర్షంబుగూర్చిన ♦ యట్టినాఁడు
పెద్దన్నవ్రాసిన ♦ పద్యాలలోపాలు
జూపిమెప్పింపఁగ ♦ జూచునాఁడు
నేనుజేసిన మేలెద్ది ♦ నీకు లేను
ఫలముఁ గోరవునీవునుఁ ♦ ధన్యమతివి
యీయుదలఁచితి బహుమతి ♦ నిష్టమేదొ
కోరుకొనుమయ్య హర్షంబు ♦ గూర్పుమయ్య॥

రామ—అయ్యా! కృష్ణరాయసార్వభౌమా! తాము దానకర్ణులని బాగుగా తెలియుదును. కాని

గీ॥ కాళికాదేవి కృపను నా ♦ కహరహంబు
కొఱఁతలేకుంట నేమియుఁ ♦ గోరఁబోను
మనుజమాత్రులు శక్తులా ♦ మహినియెపుడు
కొఱఁతలందీర్ప నొకవేళ ♦ కోరుకొనిన॥

కృష్ణ—ఔరా! ఈతఁ డెంతమాటయనినాఁడు. నాయంతవాఁడను బహుమతినొసంగెద కోరుకొనుమన వలదని నిరాకరించినాఁడు. (ప్రకాశముగా) రామకృష్ణా! నీవుగడించినధనమంతయు నెచ్చటిది. మదాస్థానములోనిదికాదా? ఆకాళిక యెచ్చటినుండియైనను తెచ్చియిచ్చినదా?

రామ—ఆదేవి యనుగ్రహమున నేనే సంపాదించుకొంటిని.

కృష్ణ—ధనమదాంధతచే నిట్లుపల్కితివి. ఒకవేళ నీధనమంతయులాఁగుకొని భ్రష్టునిఁగా పురమునుండి వెడలనడచిన యేమిచేయఁగలవు. సన్యాసివై భైక్ష్యమునకు బొల్పడ వలసినదేగదా?

రామ—స్వామీ! ప్రస్తుతపు పరిస్థితులు కారణముఁగా నేను సన్యాసము పుచ్చుకొనుటకు సిద్ధముగనేయున్నాను. నాయంత నేనే పుచ్చుకొనవలెననియుంటిని. దేవరయే యిప్పించుచున్నారు. సంతోషమాయె. స్వర్ణయోగచింతామణీ ప్రబంధమహావ్యూహము బన్నుటకట్టి తురీయాశ్రమమెగాని యుపకరింపదు.

కృష్ణ—నీ నుడులు విపరీతముగనేయున్నవి. నీకేమైన పిచ్చపట్టినదా? వలయు బహుమతిని యిప్పటికైనను కోరుకొమ్ము.

రామ—స్వామీ! నాకు పిచ్చయే పట్టినది.

కృష్ణ—కవిచంద్రమా! ఈ యసందర్భపుమాటలేల?

రామ—లేదులేదు. నాకునిజముగ పిచ్చయే పట్టినది. జాడ్యనివర్తనా సామర్థ్యముగల యోషధి యెట్లుదొరకునాయని విచారించుచున్నాను. భవాని యనుగ్రహమున దేవర వాచానుసరణిని తురీయాశ్రమధర్మముల నెరవేర్చుసందర్భములయందే గిరిగహ్వరములయందైన కన్పట్టకుండునా? దొరుకగలదు. నిశ్చయముగ దొరుకగలదు. అమ్మహాయోషధి ప్రారంభమున కటువుగనే కాన్పించును. కాని సేవించినయంత కలవిషయము బోధపడగలదు. ఈరామకృష్ణుఁడింకను మీకు చిరపరిచయుఁడుకాలేదు.

ఆకారణమున నానుడులు మీకు విపరీతముగనే యుండును. నేను బహుమతిని గైకొనలేదని యింతరాద్ధాంతమా! అద్దాని కొక యపస్మారకవ్యాధిఁ గల్పింతువా?

గీ॥ బహుమతులఁగోర రాజుల ♦ ప్రార్థనంబు
లొల్ల, కాళికాదేవినే ♦ యెల్లవేళ
మనమునందున దలచుచు ♦ మసలువాఁడ
రాచబాధలుపడరాదు ♦ నీచభంగి॥

(నిష్క్రమించును)

కృష్ణ—మంత్రిసత్తమా! రామలింగని నేను హాస్యమునకుఁగాను భయ పెట్ట అర్థముఁజేసుకొనక సభవదలిపోయినాఁడు. బ్రాహ్మణ కోపము తృణకణమునందలి యగ్నిచందము. నేటికి సభ చాలిం తము. ఆతనికర్హమైన బహుమానమును విచారించియే యుంచి నాను. రేపటిదినము కొలువుకూటమునకుఁ గొనిరండు. అర్థసిం హాసనమున నధిష్ఠితునిఁ జేయవలయును.

తిమ్మ—చిత్తము.

(నిష్క్రమించును)

(తెరపడును)



శ్రీ

# తెనాలి రామకృష్ణ చరిత్రము.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

రంగము—వేశ్యాగృహము.

[ఒంటరిపాటున శ్యామల ప్రవేశించును.]

శ్యామ—ఇదేమి యన్యాయము? మాసరస్వతి ప్రవర్తనము పూర్తిగ మారుచున్నదే?

చ॥ సరసుఁడు మంత్రిపుత్త్రకుఁడు ♦ చక్కనివాఁడు లభించియుండఁగా
నిరసనబుద్ధి జూపెడివి ♦ నీతియెకూడదు చెల్లెలా మహో
ద్ధరమగు వేశ్యధర్మమన ♦ దానదియక్రమ కార్యమంచనున్
ఎరుగదు లోకవర్తనము ♦ నేర్పడబోవదు చెప్పిచూచెదన్॥

సానికులమున జనించియును సంసారిసగుదు ననుచున్నది. ఎవరి కులధర్మములను వారు నిర్వహించుకొనుటయందు దోసమేమియున్నది? భగవానుఁడు మా నుదుట మేమీతీరున నుండవలసినదిగా మూఁడు పంక్తులను వ్రాసియున్నాఁడు. జాత్యుద్ధరణమున కెన్నిసంస్థలు బయలు దేరిననేమి? కులగుణము లెన్నటికిని మారనేరవు. అయ్యావి వంశ పరంపరానుగతములే. (పరికించి) అదిగో సరస్వతి యిక్కడకే వచ్చు

చున్నది. దాని కేదియోవిధమున నచ్చఁజెప్పి మంత్రిసూనుని యను గ్రహమునకుఁ బాత్రవుగా యత్నింపుమని బోధచేయుదుఁగాక.

(సరస్వతి ప్రవేశించును.)

శ్యామ— అమ్మాయీ! సరస్వతీ! నీ కొఱకు రావలెననుకొనుచుండ నీవే వచ్చితివి.

సరస్వ—ఎందులకక్కా?

శ్యామ—ఏమియును లేదు

గీ॥ తిమ్మనార్యుని పుత్రుఁడు ♦ తిరుగుచుండె
నీకునై యంచు వింటిని ♦ నిజముచెపుమ
హార్దమేదేనిఁగూర్చితే ♦ యతనికీవు
తెలియఁజేయుము కలమాట ♦ తేల్లముగను॥

సరస్వ—ఎంతటి చమత్కారివే? అమ్మచెప్పియుండలేదా? తెలియని యట్లు మాట్లాడెదవేల?

శ్యామ— ఏమో! నాకేమియును తెలియదు. అసలు విషయమేమి?

సరస్వ— ఏమున్నది. తిమ్మనార్యుని కుమారుఁడు దేవాలయములో కళ్యాణమునాఁడు నన్ను చూచినాఁడఁట. అప్పటినుండియును నాకొఱకు తిరుగుచుండెననియును వేశ్యలకు వివాహము కుల ధర్మము కాదుకావున నింక నాపిచ్చి మానుమనియును చెప్పి అమ్మ నన్నాతనితోఁ బొందునకై ప్రోత్సహించినది.

శ్యామ—నీవేమి సమాధానము జెప్పితివి?

సరస్వ—వలదంటిని.

శ్యామ—నీవు నిశ్చయముగ నిందు పొరఁబడితివి.

సరస్వ—పొరబాటేమియున్నది?

శ్యామ— ఏమియున్నదా? మంత్రియును రాజతుల్యుఁడే. రాజునుమించు ధనికుఁడే. అతనిని జెట్టఁబట్టితివేని యపారధన

మున నిరంతర సౌఖ్య మనుభవింపఁగలవు. నీకుఁ గొదువ యేమియుండును?

సరస్వ—మనమెన్నఁడును దరిద్రులమే.

శ్యామ—అదేమే! అట్లనియెదవు.

సరస్వ—మనకులపువారల కగ్నికెంత చిచ్చున్నను తృప్తియుండనటుల యెంతయైశ్వర్యమున్నను తృప్తియుండదు. అదియునుగాక మన కెంతధనమున్నను వృద్ధాప్యమునచ్చునపకి చేతఁ బుచ్చినవక్కయైన నుండదుగదా?

శ్యామ—నీయుపమానము బాగుగలేదు. మంత్రిపుత్రునికన్న నెక్కుడు వారుందురా? అంతకన్న నీవాంఛితముల నీడేర్చువారు, నీవు కోఁ డగినవారుందురా?

సరస్వ—మాయల పచరించు గోసాయిజాతిలేదా?

శ్యామ—ఏమీ! గోసాయిబృందమా?

సరస్వ—మనకునలయునదే సావనిత్యముఁ జేసినను ధనమేగదా! గోసాయి జాతివారు బంగారముఁ జేయ సమర్థులు.

శ్యామ—సరస్వతీ! బంగారాములను జేయఁగలవారిప్పుడు లేరుగదా? ఉండియుండిన ధన్యులమేకాఁగలము.

సరస్వ—లేకేమి యిప్పటికెవి యుండియున్నారు. కొలఁది కాలమునకుఁబూర్వ మొకబైరాగి మనగృహమున కనతిదూరముననున్న యశ్వత్థ వృక్షమునీడ నేదియో జపించుచు తినచుట్టుఁజేరినవారి కేవియో మందులనిచ్చుచుండెను. అతఁడొకవార మందుండుసరి కాతఁ డిచ్చుయోషధులు కారణముఁగా చిరకాలార్జితములైన వ్యాధులునయముతము మానజొచ్చినవను వదంతి బయలుదేరినది. అమ్మయును తన వంటజితించిన సంకటములు నివారించుకొను టకుగాను మాయోపాయమున మనవీధియరుగుపైకిఁ గొనివచ్చి

కొంతకాలమునకు చలియను నెపముబెట్టి లోపలిసావిడిలో సికిం గొనివచ్చినది.

శ్యామ—ఆయన యిప్పుడున్నారా?

సరస్వ—అతండెవ్వండో మాయకాండు. సన్యాసులు సాధారణముగా గృహస్థులయిండ్లయందేయుండరు. అందున నితండు వేశ్యా గృహముం జొచ్చినాండు.

శ్యామ—ఎటనున్ననేమి మనస్సు నిబ్బరముగానుండిన చాలును. భయములేదు. అతనినిం జూచిన త్తమురమ్ము.

సరస్వ—నిన్ను గొనిపోవుటకేవచ్చితిని. అమ్మ తీసుకొనిరావలసినదిగా చెప్పియున్నది. ఇంకకొంచెము కథమిగిలియున్నది. వినుము పోవుదము.

శ్యామ—ఏమది?

సరస్వ—ఏమియును లేదు. మనలోపలిసావిడి యాయనకుం జాల సౌక ర్యముగా నున్నది. ఇంటిలోనికి వచ్చినప్పటినుండియును, పాల కనియును పెరుగునకనియును నెపముంబెట్టి దినమునకైదారు వరాలసీయ నారంభించినాండు. అమ్మ యిదిచూచి యాయన యొద్ద స్వర్ణయోగమంత్రముండునని యూహించి దానిని బొంద నపేక్షగలదై "మంత్రిపుత్రునితో సమాగమ మవుసరములేదు. యీ యోగినింజేరి యేమాయోపాయముననో స్వర్ణయోగ మంత్రమును తెలుసుకొనుమని నత్తిడిచేయుచున్నది. బంగారముం జేయ యత్నించినవా రనుభవములో నెందరు భ్రష్టులుకాలేదు?

శ్యామ—సరస్వతి! బాల్యమునుండి నేలనోగాని నీబుద్ధి వ్యతిరేకభావ ములనే బల్కుచుందును. యోగినింజేరి మంత్రము గ్రహింప రాదా?

సగన్వ—నాకునలదు. అట్టి దుర్మార్గముల నేను చేయను. (స్మృతినభిన యించి) అదిగో! అమ్మ మఱల పిలుచుచున్నది. రమ్మ పోవుదము (నిష్క్రమింతురు)

(తెరపడును)

---

## ద్వి తీ య ర ం గ ము.

రంగము—వేశ్యాగృహము.

(కృష్ణాజనముపై శ్యామల పరుండియుండును యోగివేషమున రామలింగఁడు ప్రవేశించును.)

రామ—పొందుటకు దుర్లభమగు మనుష్యదేహమును, అందునను పురుషజన్మమును పొంది తన హితమునుగూర్చి యోచింపని వానిగతియే యధోగతి. అది ధీరలక్షణముగాదు.

గీ॥ మత్తమాతంగ భంజనుల్ ♦ మహినిగలరు
యెదిరి మృగరాజునథయించు ♦ ప్రథితబలులు
కలరుగాని మన్మథుఁడేయు ♦ కఠినబాణ
ఘాతలకెదిరి జయమందు ♦ ఘనులు లేరు॥

కావున లోకమునసేని సాహసులనదగును? "కశ్శూరో యోలల నాలోచనబాణైర్నచవ్యధితః" అన్నారు పెద్దలు. స్త్రీల చూపులచే జయింపఁబడనివాఁడే శూరుఁడు. మన్మథబాణములచేఁ గొట్టఁబడియును చలింపకున్నవాఁడు శ్రీరాముఁ డొక్కఁడే. నేను రామశబ్దవాచ్యుఁడను. అట్టి రామశబ్దమును మన్నామమున నిమిడియుండుటను నా దయామయుఁడు మన్మథునిజయించిన శూరునిఁగా నన్నొనర్చునుగాక.

(శ్యామల నుద్దేశించి) శ్యామలా? నీ ప్రయత్నములు ఫలరహితములు.

చ॥ మదనవిలాససృష్టమగు ♦ మన్మథచాపవిముక్తసాయకం
బదియుపయోగకారియని ♦ యాత్మలో నీవు తలంచుచుంటివా
సుదతిరో! వర్తనంబునను ♦ శూరుఁడ స్త్రీకృతమోహదష్టుఁడీ
సదనున ధీరతాగుణము ♦ నందనివాఁడొక ధీరబుద్ధియే॥

శ్యామల బాల్యమున నే స్వల్పకాలమో
గీ॥ తనదు కులధర్మములయందె ♦ తానునుండెఁ
గాని కృష్ణరాయునితోడఁ ♦ గల్గినంత
స్నేహమూకారణ పూర్వపుఁ ♦ జేష్టలన్ని
వదలి వర్తించె కులకాంత ♦ వలెనె తాను॥

ఇందులకుఁ గారణము ముఖ్యా ధనము. వేశ్యకెంత ధనమున్నను తృప్తియుండదు. విటులు వేశ్యలను వాంఛితముల దృప్తిపరుపఁజూచుచుందురు. ఈయది వ్యర్థమనియును నిద్దానికిఁగారణమును తెలియరు. విచారింప స్త్రీ లాభరణములతోడను నైశ్వర్యముతోడను సన్మానింపఁబడుచున్నను మానవులను జలగలవలె పీల్చుచున్నారు. జలగ కేవలము రక్తాపేక్షగలది కావున రక్తమునుమాత్రమె పీల్చుచున్నది. కాని వేశ్యలు మానవుల సర్వస్వమును పీల్చివైచెదరు. ధీరులు వేయి దుఃఖములనయిన భరింతురుగాని దుష్టురాలగు స్త్రీవలనగల్గు దుఃఖమును మాత్రము భరింపఁజాలరు. వేశ్య దుష్టురాలుగాక గుణవతి యగునా? రాయుని చెట్టబట్టుటచే శ్యామల యెంతయును ధన్యురాలు. అందువలననే పాతివ్రత్యధర్మములను నెరవుచున్నది. శ్యామల దోషరహితయని రాయఁడు నమ్ముచున్నాఁడు. సర్వవిధముల స్త్రీలకన్న పురుషులే దుస్స్వభావులు.

ఈవిషయమున రాయని విముఖునిఁగా జేయుటయే నాప్రయత్నము అదాపకేగదా యీతీరుపాటు పడుట. కాని గోరుచుట్టుపై

రోకటిపోటన్నట్లు శ్యామల రాయుని వదలి నన్నే కోరుచున్నది. కాదు కాదు. రాయనివదలి నన్నుఁగోరునా? రాయఁడుకలఁడు. నన్నును గోరుచున్నది. వెలయాలికి మగలసంఖ్యయేల? నన్నుఁ గోరుటకుఁ గారణమందునా బంగారమును జేయు విధానమును నేర్పుదునను భ్రాంతియే. నేను రాయఁడనుకాను. అంతటిభ్రాంతి నాకులేదు.

(పరికించి) నేను లేనిసమయమున నా కృష్ణాజినముమీఁదనే యాసీనయై గోముఖిని ధరియించి జపమాలఁ ద్రిప్పుచుండును. నేటి దినమును నాయాసనముననే యలసినట్లు పడియున్నది. నిద్దుర దొంగ నిద్దుర. శ్యామలా! శ్యామలా!

శ్యామ—(నిద్రోన్మాదముతో)

గీ॥ రక్తనయనాము మాధవు ♦ రాకఁగోర
యుక్తకాలంబు గాకున్న ♦ నువిదఁజేరి
వలయు కోర్కెలఁ దీర్పఁడే ♦ వలనెఱింగి
చెలిని వరియింప నింత వి ♦ రాగమేల॥

రాము—శ్యామలా! పొరఁబడుచుంటివి. దూషించుటకు నేను మన్మథుఁడఁగాను. నన్ను రామయోగియందురు. నిద్రాభంగమైనదేమో! తెమ్మక పలుభ్రమలఁ బడుచుంటివి.

శ్యామ—(సమీపించి) స్వామీ! ఎప్పుడువచ్చితిరి?

రాము—శ్యామలా! నీ ప్రవర్తనము తెలియవచ్చినది.

చ॥ తెలిసెను నీదువాంఛితము ♦ తెల్లముగానిక శ్లేషమాటలన్
బలుకఁగనేల నీవు విను ♦ పాపపుకార్యము నేనుజేయ నీ
కలిగిన పుణ్యలేశమును ♦ గానక వ్యర్థముఁ జేసికొన్న నే
నిల గణియింపఁగాఁగలనె ♦ యెంత ప్రయత్నముఁ జేసియేనియున్॥

మఱియును

గీ॥ వివిధసుఖముల నొసఁగెడి ♦ వెలవెలంది
ధర్మపత్నియె సుగుణముల్ ♦ తరుగుగాదె
చిత్రకార వినిర్మిత ♦ చిత్రసుమము
సురభి మధువుల బొందఁగ ♦ జూచినావె॥

సీతోడనా సమాగమము. కృష్ణరాయనివేశ్య పతివ్రతయన విని యున్నాను. ఇదేటిన్యాయము.

గీ॥ ప్రభుని వంచించి పరునికై ♦ ప్రాకులాఁడు
దురితబుద్ధివెయంచును ♦ దొలుత తెలియ
జోగి సంపర్కగరిమను ♦ జోగియగుట
ఫలమటంచును తెలియుము ♦ పడతినీవు॥

నా మనోవృత్తము సర్వమెఱింగిన నీవిట్లు నన్ను కోరఁదగునా? అదియునుగాక యీకాలములో సానులు పతివ్రతలగుచున్నారనుమాట నువినియున్నాను. దోషముకాదా?

(కృష్ణరాయఁడు ప్రవేశించును)

శ్యామ:—స్వామీ! తమసంభాషణమువలన తాము పండితోత్తమనియును యేకపత్నీ వ్రతులనియును తెలియవచ్చుచున్నది. లోకములో సాధారణముగా సరసులగువారు తమభార్యలతో విహరించు వారైనను సుఖచమత్కారాదుల పరీక్షకై పరస్త్రీలనుకూడ రమించుచుందురు. కాదందురా?

రామ—శ్యామలా! సుఖమువలదు. సౌఖ్యమువలదు. వ్యభిచారము తప్పుకార్యము. దూరముగబొమ్ము.

శ్యామ—లోకములో స్త్రీ కామమును దీర్పకున్న దోషముసుమా! అట్టి దోషనివారణమునకేగదా విశ్వామిత్రాదులు మేనకాదు లను కామించినవారు?

రామ—ఓహో! పూర్వపుగాథలు ప్రారంభించినావే? వారికన్న నెక్కుడు వాఁడ గానని యా నీ యభిప్రాయము? వారికున్న శక్తియును నాకు లేదు. అట్టివారియందలి గుణాగుణసామ్యమును నాకు నందు. పరస్త్రీసంభోగజన్యపాపమును దానిని బోగొట్టునట్టి తపోరూపప్రాయశ్చిత్తాదికమును నేను చేయలేను.

శ్యామ—అయిన నా యభిప్రాయమును దీర్పరన్నమాటయేనా?

కృష్ణ—(తనలో) నేనరుదెంచునప్పటికీ వారనారియును యతీశ్వరుఁడును యేవియో కామసూచకములగు మాటలనాడుచుండిరి. కల తెఱఁగెఱుఁగని పూర్వము పలుకరించినచో భావము పూర్ణముగ బోధపడజాలదని యోచించి యింతవఱకు దూరముగనుండి యీ కాంతయే దోషియని తెలిసికొంటిని.

రామ—శ్యామలా! ఇదేటికార్యము? నీ పాతివ్రత్యమునకు భంగము రాదా?

శ్యామ—వారకాంతకు పాతివ్రత్యమా! ఎంతమాట! వేశ్య వెలయాలగునుగాని కులకాంత కాఁజాలదుగదా? నాపాతివ్రత్యముమాట యటుంచి యీ శ్యామలాసాంగత్యమునుఁగూర్చిన యభిప్రాయము నిర్ధారణపరుపుఁడు.

ఉ॥ కోపమువీడగానలయు ♦ కోరితి కారణముండియుంటనే
నాపలుకాలకించి నచ ♦ నంబిము మొప్పెడిరీతి యీతరిఁ
పాపము పుణ్యమేననుచు ♦ భావములోన దలంపబోలదా
పాపము నాదికోరుటను ♦ భావ్యముకాదు పరిత్యజింపగఁ॥

రామ—(తనలో) ఈదినమింతవఱకు రాయఁడు రానికారణమేమై యుండును? (ఆలోచించి) నాబుద్ధి బలిమిని ప్రశ్నించిచూడఁగా నిందే యెందో యదృశ్యుఁడై యీ తుచ్ఛురాలివర్తనమును తిలకించుచున్నాఁడని తోచుచున్నది. సందేహములేదు. అట్లనే

యీకాంతతోఁ బొందునకుద్యుక్తుఁడనగు నట్లభిప్రాయమును గనపరచి యుక్తమైన సమయమును గనిపెట్టి వంచించి నేను రామ కృష్ణుఁడనని తెలియజెప్పుదును. ఇంతలోన రాయఁడును రాఁగలఁడు. (ప్రకాశముగా) శ్యామలా! ఈతీరు బ్రతిమాలుచున్నావుగాన,

గీ॥ దోషభూయిష్టమనుమాటఁ • దొలఁగద్రోసి
నీదువాంఛను నెరవేర్ప • నాదుమదిని
తలఁచుచుంటిని శ్యామలా • తగదటంచు
యెంతబోధించి జెప్పిన • నెరుఁగ వీవు॥

శ్యామ—(తనలో) ఎట్టులైన నీ యోగీశ్వరుని రంజింపఁజేసి స్వర్ణయోగమను దివ్యక్రియను సంపాదింపఁగల్గితిని. (ప్రకాశముగా) స్వామీ! ప్రథమమునచే తమనుండి యొకవస్తువును వాంఛించి యుంటినని చెప్పియుంటిని. దయయుంచి స్వర్ణయోగ మనోరథమును దీర్చినయంత మీరు కోరినదానిని చేయఁగలను.

రామ—నీనుండి కోరఁదగిన వస్తువేదియును లేదు. (తనలో) నిన్ను గారవపర్చుటకే వచ్చియున్నాను. నీయభిమతమును దీర్చినతదుపరి నాయభిమతమును దీర్తునంటివి. అది న్యాయముగాదు. నానుండి యుపదేశమును పొందనున్నదానవు ముందు నన్ను గారవించవలయునుగదా?

(అని చేయిబట్టుకొన శ్యామల విదలించుకొనును)

రామ—ఈవిభూత్యుద్ధూళనావృత వికృతాకారముఁజూచి కన్నులు మూయుచున్నావేమి? నీకురుచింపలేదుకావలయును శ్యామలా!

“వరబింబాధరముల్ పయోరుహముల్ • నక్రాలకంబుల్ మనోహర లోలాక్షులుచూప కప్పలి మొగం • బైనంత నేమాయె నీ

గురుభాస్వజ్జఘనంబు క్రొమ్ముడియు మా ♦ కుం జాలవే గంగ క
ద్దరి మే లిద్దరి కీడునుంగలదె యు ♦ ద్యద్రాజ బింబాననా"॥

శ్యామ—ఔరా! మోసమాయె. రామకృష్ణుఁ డెంతకార్య మొనర్చినాఁడు. నేనొసంగిన "గంగకద్దరి.\ .......బింబాననా॥ అను సమస్యను రామలింగఁడు పూరించునని పిరియుఁడు చెప్పియుండెను. ఈవిషయ మాయనకుఁ దెలియకుండునా? ఇక మీఁద నావిషయమున రాయని యభిప్రాయ మెట్లుండునో?

(నిష్క్రమించును)

రామ—ఈకాంత నన్ను రామకృష్ణునిగా తెలసికొని యిటనుండి సిగ్గున వెడలిపోయినది.

కృష్ణ—(ముందునకువచ్చి) మిత్రమా! క్షమింపుము. వారకాంతా సమాగమమును వదలుకొనుచున్నాఁడనని బాసఁజేయుదును. ఇప్పటికే తడవాయె. నిన్నర్ధసింహాసనమున నధిష్ఠితునిగా జేయవలెనని యభిప్రాయము. రమ్ము సభామంటపమునకుఁబోదము. ఈయోగివేష మేమి చేయుచేతలేమి!

(నిష్క్రమింతురు)

(తెరపడును)



## తృ తీ య ర ం గ ము.

రంగము—రాయని సభామంటపము.

(రామకృష్ణుఁడు, కృష్టరాయఁడు, మానవతి మొదలగువారుందురు.)

తాతా—రామకృష్ణా! ఇఁక మీరాయని యాస్థానమున ప్రధానపండి తుఁడవై యుందువుగాక.

కృష్ణ—రామకృష్ణా! నిన్నర్ధసింహాసనమున నధిష్టితునిఁ జేయవలెనని నా యభిప్రాయము.

మఱియును నాదొక ప్రార్థనముగలదు. నీభార్యయగు మానవతి పతివ్రత. ఆయమను సుఖపెట్టుము. దైవకృపను నా యభిమతము సిద్ధించినది. మనకింకేమి కావలయును. అయిన నిట్లగుఁగాక.

భరతవాక్యము.

గీ॥ భావకవులెల్ల ప్రాజ్ఞులై ♦ పండితులయి
వెలయుచుందురుగాక యీ ♦ విశ్వమునను
అరయ పతిభక్తి కాంతల ♦ యందు ప్రబలి
భరతఖండంబుకీర్తి సం ♦ భరిత మగుత॥

మంగళం. మంగళం. మంగళం.

(తెరపడును.)

స ం పూ ర్ణ ము.

రామకృష్ణ ప్రింటింగువర్క్సు, తెనాలి.

# భోజకాళిదాసు.

(గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు)

అవతారములు దాల్చిన సరస్వతీ చతుర్ముఖులని ప్రతీతిగన్న కాళిదాస భోజనరేంద్రుల చరిత్రములు రెండును ఏకనాటకముగా బంధింపబడి ప్రదర్శన యోగ్యముగా రచింపబడినది. ఇందలి పండితుల వాద ప్రతివాదములు, భోజరాజు పండితాదరణము, అష్టదిగ్గజముల కవితా వినోదములు, కాళిదాస కవీంద్రుని మహాత్మ్యము, లీలావతీదేవి పాతివ్రత్యము, ఇతర కవులకు కాళిదాసునిపై ఈర్ష్య, భోజ కాళిదాసుల విరోధము, వేశ్యకౌటిల్యము, భోజునిహత్య, కాళిదాస మహాత్త్వమున పునర్జీవితము మొదలగు ననేకాద్భుత విషయములలో సర్వజనవేద్యములగు సమస్యా పూరణములతో కాళిదాస శ్లోకములతో నున్న గొప్పనాటకము. వెల రు. 1—4—0.

# సారంగధర

[గ్రంథకర్త:—కొప్పరపు గోపాలకృష్ణమూర్తిగారు]

క్రొత్తగా రచింపబడిన శృంగారనాటకము! ఆంధ్రభాష కలంకారము! చిత్రాంగి సారంగధరుల ప్రసంగము శృంగారరసపరిపూర్ణము- రాజనరేంద్రుని దైన్యము పఠనీయము—రత్నాంగిశోకము విషాదతరంగ సంక్షుభితము—సుబుద్ధి మిత్రవాత్సల్యము సర్వజనాదర్శప్రాయము! సారంగధరుని సౌశీల్యము మహాశ్చర్యప్రదము—నాటకము శుభాంత ముగా రచింపబడినది. చక్కనిపాటలు గలవు. వెల రు. 0—8—0.

# సతీ సక్కుబాయి.

ఇది ఆంధ్రదేశప్రజనుల భాగ్యవశమున వెలువడిన యమూల్య నాటకమణి. సక్కుబాయి నాటకము చేతియందున్నవారిపాపములు భస్మమైపోవుననుట నిస్సందేహము. ఈనాటకరాజమునందలి పద్య మొక్కటిచదివినవారు స్వర్గలోకమందు దేవతలచేబొగడబడుచుందురు. సక్కుబాయి పతివ్రతామతల్లి, భగవంతునిచేత నత్తగారికి సేవచేయించిన గారడికత్తె. శ్రీకృష్ణుని సవతిగాజేసికొనిన నెరజాణ. పాండురంగని భార్యగాఁజేసి తన మగనికి సౌఖ్యమొసంగిన మంత్రవాదిని—భక్తిరస రసాయనము లోకములో వెదజల్లి, జనుల యజ్ఞానరోగమును రూపుమాపిన గొప్పవైద్యురాలు—అమాయకుడగు తనభర్తను సకలవిధముల సేవించిన పుణ్యాత్మురాలు—యమదూతవంటి యత్తగారిచేత కోరంటి కముపడి, యామెను పాండురంగని భక్తురాలినిగాఁ జేసిన తపస్విని.

అనేక సలక్షణ మహానాటకములువ్రాసి కీర్తిగడించిన సోమరాజు రామానుజరావుగారు యీనాటకరాజమును రచించినారు. ఇందలి పద్యములు అమృతపుగుటికలు, యిందలివాక్యములు మామిడిపండు ముక్కలు, యిందలి భావములు పటికబెల్లపు పలుకులు. ఇందలి అక్షరములా అక్షరములే. వేయేల? దీనిప్రాశస్త్యమును చెప్పుటకు వేయినోళ్లు గల యాదిశేషుఁడు అవతరించవలసినదేగాని, మావంటివారి కలవిగాదు. త్వరపడుడు. మించినపిమ్మట యోచించిన లాభములేదు. మహాలక్ష్మి ముంగిటకువచ్చి తొంగిచూచినట్లు ఈనాటకలక్ష్మి పుస్తకరూపమున సరస్వతీ బుక్కుడిపోను అలంకరించినది.

వెల రు. 1—0—0.

వలయువారు:—కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ.

